

తీరిక సమయంలో

ఫోటోలు:— జి. వి. శేషగిరిరావు, (రాజమండ్రి.)

జూన్ విడుదల!




# సమాజం

డైరెక్షన్.. అడ్డాల నారాయణ రావు

మాటలు సముద్రాల • సంగీతం అశ్వత్థామ • నృత్యం పసుమర్తి • కళ సోమనాథ్ • ఛాయ మల్లి ఏ.ఇరానీ • కూర్పు M.బాబు

తిరుమల పిక్చర్సు

FLOODLIGHT

STUDIO

చమ్రియా రిలీజ్

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

★

Founder
K. Nageswara Rao

స్థాపితము
1908

★

సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

★

సంపుటము 55
సంచిక 38

1-6-60
బుధవారం

శార్వరి జ్యేష్ఠ సప్తమి

★

విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 18-0-0

★

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి,
మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం:
వి. ఎ. ఎస్. వారి
'రాణీ రత్నప్రభ' చిత్రంలో
అంజలీ దేవి.



## వచ్చే సంచికలో సినిమా బాలట్ ఫలితాలు

## ఉత్తరాలు

"జ్యోతిష్యం నిజమా? కాదా?" అను శ్రీ చంద్ర గారి రచన చాలా బాగుగా రచించబడినది. గ్రహాలు, శాంతులు అని పాత చింతకాయ సిద్ధాంతాలను పట్టుకొని యీ నూతన యుగంలో కూడా ప్రాకులాడుతూ జీవితాలను దుఃఖమయం చేసుకొనే వారికి యిది చక్కని గుణపాఠం. ఈనాడు పిచ్చి నమ్మకాలతో ఏదో ఒకటి పొట్టకూటి కోసం చెప్పబడిందంటే దాన్ని పట్టుకొని ప్రాకులాడుతూ, చేసే ప్రయత్నాలను కూడా విడచిపెట్టి అంతా గ్రహపాటు అని తలచే అమాయకులు యిక ముందైనా మేలుకొంటారని ఆశించవచ్చు. ఈలాంటి చక్కని వ్యాసాలను పాఠకుల కందించి విజ్ఞాన వికాసాలను కలిగించే ఆంధ్రపత్రికకు ధన్యవాదాలు.

శి.వి. నరసింహారావు, కడప.

* * *

మీరు "జ్యోతిష్యము నిజమా? కాదా?" అన్న వ్యాసం ప్రచురించి కూడా "రాశిఫలాలు" ప్రచురిస్తున్నారంటే నాకు చాలా ఆశ్చర్యం వేస్తోంది. అదీగాక, ఒకే రాశిలో కొన్ని లక్షలమంది (కోట్లమందే, అనొచ్చు) పుట్టియుంటారు గదా! మీరు వ్రాసిన ఆ నాలుగు వాక్యాలు, ఏవి భవిష్యత్తు, ఎవరి భవిష్యత్తు తెలియజేయగలవు?

దాసరి పట్టాభి, కాశీపురం.

* * *

జోస్యాన్ని నమ్మి తమ అభిప్రాయాలను, ఆశయాలను కూడా మార్చుకొని రెంటికీ చెడ్డ రేవడలాగ సర్వనాశనమైపోయి గూడ మూఢనమ్మకాల్ని వదలని వారికీ వ్యాసం ఒక గుణపాఠమని చెప్పవచ్చు.

గీట్ల జనార్ధనరెడ్డి, మంథెన. (కరీంనగర్ జిల్లా.)

* * *

ఈ 20వ శతాబ్దంలో మూఢ విశ్వాసాలను విశ్వసించేవారికి వ్యాసం కనువిప్పు. ఈ వ్యాసం భవిష్యత్తుకు, భావితరాలవారి శుభోదయానికి నాంది కాగలదు. రాబోవు కాలాల్లో ప్రజ దీని ప్రాముఖ్యం తెలుసుకొని శ్రీ చంద్ర గారిని అభినందించక ఉండరు.

బి. వేణుగోపాలరెడ్డి,
ఎ. నారాయణపురం.

* * *

"చంద్ర" గారి వ్యాసము చదివి చాలా విచారించితిని. ఆయన శుద్ధంగా జ్యోతిషశాస్త్రం తీసి పారేసినట్టు వుంది. జాతకాలమీద నమ్మకం లేనివారు జోస్యం నమ్మకపోవచ్చు. మంచి మంచి జ్యోతిష్కులు ఎంతమంది లేరు! వారు చెప్పినవి ఎన్ని నిజం కాలేదు. మాకు తెల్సిన ఒకాయన వున్నారు. ఆయన జరిగినవే కాకుండ

జాతకచోయేలి కూడా అరటిపండు వలిచినట్లు చెప్తారు. మాకు చెప్పినవి మా ఫ్రెండ్సుకి చెప్పినవి ఎన్ని నిజం అయినవో చెప్పలేను. అందుచేత జాతక చక్రాలను గ్రహాలను తీసి పారేయమనడం ఏం బావులేదు.

మిసెస్ సుమన్ శంకర్, ఆదోని.

* * *

జోస్యం పై అపహాస్య వ్యాసం చదువుటకు చాల బాగున్నా కష్టముగనున్నది. షట్ శాస్త్రములలో జ్యోతిశ్శాస్త్ర మొకటి. ఈ శాస్త్రములో ఉద్దండులైన పండిత ప్రకాండుల నాటినుండి నవ భారతానికి గురు ఇంతవరకు ఈ వ్యాస రచయిత సిద్ధ ప్రశ్నల కూర్పుండి “ఉదర నిమిత్తం బహుకృత వేషః” అన్నట్లుగా పొట్టకూటికై జ్యోతిష్కులవలె నటించు కపటశాస్త్రజ్ఞుల దృష్టిలో నుంచుకొని ఆ వ్యాసము రచియించి యుండెనో వు

ఇంకను ‘జోస్యం’ నిజమా అను సందేహముండు అ వ్యాసకర్తను ఈ సంచికయందే మీరు ప్రకటించిన “సరస్వతి శాపం” అను కథను పఠించవలసినదిగా నా సలహా.

కొంపతీసి ఆ వ్యాసమునకు జవాబుగా ‘సరస్వతీ శాపం’ ప్రకటించలేదు గదా! మనలో మాట.

గంగరాజు వెంకటపున్నయ్య, గుంటూరు.

* * *

ఒకటి అబద్ధాలపుట్టే గనక జోస్యం అయివుంటే, దానికి సామాన్య ప్రజలో ఇంత ఎక్కువ ఆదరణ లభించి వుండేదిగాదు, ఉదాహరణలకేం! బోలెడన్ని రెండు వైపులా వుంటాయిలెండి

“సత్యప్రియ”. నెల్లూరు.

* * *

శ్రీ చంద్రగారి వ్యాసంమీద శ్రీ గణపతి శాస్త్రిగారి వ్యాసం యెంతో సముంజసంగా ఉంది. జ్యోతిషాన్ని అబద్ధమంటూ చంద్రగారు వాదించటం ఏటికి ఎదురీదినట్లుంది.

శ్రీ పి. గణపతిశాస్త్రిగారన్నట్లు సక్రమమయిన కాలం తెలిసి అనుభవజ్ఞుడైన శాస్త్రకర్త చెబితే జ్యోతిషంలో పూర్తి సత్యముంది. సక్రమమయిన కాలం తెలియక పోయినా అనుభవంలేనివారు చెప్పినా ఫలితాలు మారితే అది శాస్త్రం తప్పవుతుందా?—

శ్రీ వత్స, రైల్వేకోడూరు.

* * *

శ్రీ చంద్రగారు బహుశా [illegible] అనేక [illegible] చెందివుండవచ్చును. నాకు తెలిసిన నాస్తికవాదులకు మిత్రులలో కూడా అనేకమంది జాతకాలు వ్రాయించుకోవడం, ప్రతివారం పత్రికలో మొదటిపాలె తమతమ వారఫలితాలు చూచుకోవడం నాకు తెలుసును. జ్యోతిషంలో ఫలితాలు సరిగారాలేదంటే, శాస్త్రము తెలియనివారైనా చెప్పివుండవచ్చు. లేదా జననకాలం తప్పి వుండవచ్చు. కావున జ్యోతిషం అబద్ధంకాదని, అదీ ఒక శాస్త్రమేనని నా అభిప్రాయం.

డా॥ యం. వి. యస్. శర్మ, (ప్రొద్దుటూరు)

* * *

ఏమండీ మీరు 18-5-60 వారపత్రికలో 64 వ పేజీలో శాస్త్రజ్ఞుడు ‘రైట్ ఇప్పుడు ఆమీట నొక్కితే బాంబు ఢామ్మని పేలి” ...అని వ్రాసి అంతటితో వదిలేసి బొమ్మ బొమ్మ వేయలేదు. అది అచ్చుపడలేదా లేక......!

గుర్రం మోహన్ రెడ్డి, తిరుపతి.

**అది అంతే.**

**“పేలి” అంటుండగానే బాంబు పేలి...**

18-5-60 వ తేదీ పత్రికలోని ఆఖరు పేజీ కార్టూను చాలా బాగున్నది. నిజానికి మాతిమ్మడు అక్కడ బొమ్మ ఏదో అచ్చుపడలేదని అభిప్రాయపడి “ఫూల్” అయినాడు. మీరు ఈ కార్టూనును ఏప్రిల్ మొదటివారంలో వేసి ఉండవలసినది.

కల్కి, రాజమండ్రి.

* * *

## పొట్టికథల పుట

‘పొట్టికథలు’ చాల బాగున్నాయి. అవి చదివి నవ్వుపుచ్చలేక (పగుల్తుందేమో అన్నంత భయంకూడ వేస్తున్నదనుకోండి) నవ్వి చస్తున్నాం.

సురేష్‌కుమారి, బొబ్బిలి.

* * *

గళ్ళ మడికట్లు తిర్గి ప్రవేశపెట్టినట్లే “చదరంగం” శీర్షిక తిర్గి ప్రారంభించమని మనవి. ఇప్పుడు ఉన్న శీర్షికలతో వారంపొడుగునా చదువుటకు పత్రిక సరిపోవుటలేదు. 4 గంటలలో పూర్తి అయిపోవుచున్నది. కనుక “చదరంగం” కూడా తిర్గి ప్రవేశపెట్టితే, దానితో 1, 2 రోజులు గడుపుటకు వీలుగా నుంటుంది, ముఖ్యముగా ప్రతిదినము పుస్తకములు చదువు వారికి ఇది చాలా అవసరమని తెలుపుతాను.

ఎస్. రామమూర్తి, కొరిశేలా.

* * *

## సినిమా బాలెట్

సంవత్సరాది సంచికలో ప్రచురించిన సినిమా బాలెట్ ఫలితాలు యింతవరకు ప్రచురించలేదు. వాటి విషయం ఏమైనా వ్రాస్తారేమోనని ప్రతి పత్రికలో ఆతురతతో చూస్తూండటము, నిరాశ చెందటంగా ఉంది నాపని. త్వరలో ప్రచురించగలరని ఆశిస్తున్నాను. ఎప్పుడు ప్రచురించేది పత్రికాముఖమున తెలియపరిస్తే సంతసించగలను.

పువ్వాడ లక్ష్మీనారాయణ గుప్త,
హైదరాబాదు.

**వచ్చే సంచికలో ఫలితాలు ప్రకటిస్తున్నాము.**

* * *

18-5-60 ఆంధ్రపత్రికలోని ‘ఆడవాళ్ళూ దేవుడూ’ అనే వ్యాసం (పేరు) చూసి సంతోషించాను; చదివి కాదు. నేను చదివినందుకు విచారించాను కూడాను. ఎందుకంటే ఆఖరి వాక్యం..."ముక్తి మోక్షం" అనుకు నేటంతటి దారుణమయిన భక్తిలోకి పోతున్నా అనేది—భక్తిమీద పెడనీళ్లు జల్లినట్లుంది. అరగంట పూజలో మోక్షం సాధ్యం కాదు. కాని మోక్షం దృష్టిలోనైనా లేని పూజ వగైరాలు పిల్లలచేత పాడించిన ప్రేమగీతంలా ఉంటుంది. దానికి విందు అర్థం, సార్థకత వుండవు. శ. ని. ప్రభావతిగారికి ఊహ మంచిదేగాని భక్తి అంటే తెలియదని నా నమ్మకం.

ఇవటూరి బసవరాజు, వాల్తేరు.

# అడుగడుగునా అపవాదాల జ్యోతిషం శాస్త్రం

## జోస్యుడన్నది ప్రతిదీ నిజమెలా అవుతుంది?

## అవుతుందని అనుకోవడం ఆత్మవంచన; అనడం పరవంచన

**దొరలు మెచ్చుకున్నారు గనుక జోస్యం శాస్త్రమే అని వాదించడం మరీ విడ్డూరం. అలంకార శాస్త్రంకూడా శాస్త్రమే. అలంకార శాస్త్రంవంటిది జ్యోతిశ్శాస్త్రమంటే బాగుండేది.**

జ్యోతిశ్శాస్త్రం లేకపోయినా ప్రపంచానికి లోటేమీ లేదు; మానవ జీవితం మామూలుగానే గడిచిపోతుంది అని ఈ వ్యాసకర్త వాదిస్తున్నారు.

"నక్షత్రకుడు"

జోస్యం నిజం కాదని చంద్రగారు వ్రాసిన వ్యాసంపై పలువురు విరుచుకుపడడం "నిజమాడితే నిష్ఠూరం" అన్న నానుడిని మరోకమారు అక్షరాల నిజమనిపించింది. అసత్యం ఎప్పుడూ అంత ఆకర్షణీయంగా ఉంటుంది. "జ్యోతిషం అక్షరాలా శాస్త్రం. ముమ్మాటికీ శాస్త్రం" అని ఒకరు అక్కసు వెల్లడిస్తూ భజన చేశారు. "శాస్త్రాన్నే కాదంటారా? హరా హరా!" అని మరొకరు కండ్లెర్రజేశారు. చాలా దూకుడుగా రాశారని మా అమ్మమ్మగారన్నారు" అని ఇంకొకరు అన్నారు. అమ్మమ్మగారికి ప్రమాదమో! "నాకు ఒళ్ళు మండిపోతోంది. నాక్కూడా కాకిని శో కొలువస్తే చంద్రగారిపని పడుదును." అని ఒకరు బస్తీ మే సవాల్ చేశారు. వారి ఒళ్లుమంటకు వారి జ్యోతిషశాస్త్రం ప్రకారం కుజగ్రహం ప్రకోపమే కారణమై ఉంటుంది. రక్తధాన్యం దానం చేసి రక్తకుసుమాలతో అంగారకుణ్ని పూజచేస్తే బాగుంటుందేమో! మంటలు తగ్గి ఒళ్లు చల్లబడుతుంది.

మరీ విడ్డూరంగా ఉన్నది "జ్యోతిశ్శాస్త్రం సత్యమే" అని శ్రీ పి. గణపతిశాస్త్రి అనేవారు (సుప్రసిద్ధ విద్వాంసులు పిలకా గణపతిశాస్త్రిగారు కాదనుకుంటాను) వ్రాసినవ్యాసం. ఏవేవో కథలు కబుర్లూ చెప్పి చంద్రగారిని ఛీటిచేశామని సంతృప్తిపడ్డారు శాస్త్రిగారు. తను చిన్నతనంలో నెలకు 80 రూపాయలు సంపాదించగలనని జాతకం ఒకాయన చూచి పదిసంవత్సరాల తర్వాత 500 సంపాదిస్తావన్నాడట. అనుకున్నట్టే తర్వాత వైద్యం ప్రారంభించి అయిదు వందలు సంపాదించాడట. కావచ్చు. ఇది జ్యోతిషం శాస్త్ర మనడానికి ఏవిధంగా ఉపయోగపడుతుంది! ఇలాంటి కట్టుకథలు నేను వేలకొద్దీ చెప్పగలను. అబద్ధమైనవి లక్షలు చెప్పగలను.

చంద్రగారన్నదేమిటి? జ్యోతిషం తక్కిన విజ్ఞానశాస్త్రాలవంటి నిశ్చితమైనశాస్త్రం కాదు అని. దానికి శాస్త్రిగారి సమాధానం చెప్పడమేమని, ప్రాచీనులు లక్షలాది జాతకాలు పరిశీలించి ఆయా గ్రహాల ఉనికినిబట్టి ఆయా ఫలితాలు కలుగుతున్నాయని నిశ్చయించుకొని సామాన్యసూత్రాలు, విశేషసూత్రాలు నిర్ణయించుకొన్నారని సమాధానం చెప్పారు. శాస్త్రం అన్నప్పుడు ఏ సూత్రమైనా ప్రపంచమంతటా సమానంగానే ఉండాలి. నాలుగు - మూడు - ఏడు అనేది భారతదేశంలోనైనా ఏడే, బ్రిటన్‌లోనైనా ఏడే, బొలీవియాలోనైనా ఏడే, ఒరేగాన్‌లోనైనా ఏడే. అలాగే ఆక్సిజన్, హైడ్రోజన్ కలిస్తే నీరవుతుందనే సూత్రమూ ప్రపంచంలో ఏ మారుమూలలోనైనా ఒక్కటే. ఏ వాతావరణంలోనైనా ఒక్కటే. జ్యోతిష ఫలితాలు అలాగని నిశ్చితంగా శాస్త్రిగారు చెప్పగలరా? తమ మిత్రుల జాతకాలు పరిశీలించామన్నారుగదా! ధనభావంలో ఫలానా గ్రహముంటే రాజయోగం అన్న సూత్రం జాతకులందరికీ సమానంగా ఎందుకు వర్తించడం లేదు? "కిం కుర్వంతి గ్రహాస్సర్వే యస్య కేంద్రే బృహస్పతిః" (చంద్రునికి కేంద్రంలో -4 7 10 స్థానాలలో - గురువుంటే ఆయుస్సుకేమీ లోపం వుండదు.) ఆ సూత్రం నిజమైతే అలాంటి గ్రహస్థితివుండీ ఆయా జాతకులు ఎందుకు చస్తున్నారు అకాలంలో? ఈ యోగంకంటే బలమైన మారకయోగం మరొకటి వుంటుంది. దానినీ పరిశీలించాలి — అని అంటారుకదూ. ఒక సూత్రానికి కట్టుబడదు గనుకనే విజ్ఞానశాస్త్రం (సైన్స్) వంటిది ప్రయోగాత్మకమైంది కాదు ఇది అన్నారు చంద్రగారు. భావనాశాస్త్రం (ఎంపిరికల్ సైన్స్) అనవచ్చునంటే అభ్యంతరమేమీ లేదు. తగిలితే తగులుతుంది. తగలకపోతే తగలదు. కొంత తగలవచ్చు. తగలకపోనూవచ్చు — అనేది భావనాశాస్త్రం. తగలక తప్పదు. మరి తిరుగులేదు, అనేది విజ్ఞాన శాస్త్రం.

జ్యోతిషం వేదాంగంగా గుర్తించబడలేదని ఎవరన్నారు? ఖగోళశాస్త్రంలో మన పూర్వుల కృషి అనంతం, అనన్యసామాన్యమైనదే. గ్రహాల స్థితిని అంతరిక్షంలేమీ ముందు చక్కగా, గణకశాస్త్రజ్ఞులు ఆశ్చర్యపడేట్టు నిర్ణయించినవారూ మనవారే. ఖగోళ విజ్ఞానం వేరు; దానిని మానవ మనస్తత్వానికి అనుకూలంగా సుఖదుఃఖ నిర్ణయ సాధనంగా ఫలితాలు నిర్ణయించే ఫలభాగం వేరు అన్న మాటను శాస్త్రిగారు తెలుసుకోకపోవడం ఆశ్చర్యంగా ఉంది. వేదాంగ జ్యోతిషంలో నభోమండలంలోని గ్రహగతి, సంఘటనల విషయాలు కాక యోగాలు, రాజయోగాలు, మొదలైన లౌకిక విషయాలు లేవనడం శాస్త్రిగారికి తెలియదా?

# సారెసారెకు సర్దుబాట్లు ఎలా అవుతుంది?

చంద్ర గారన్నట్టు మానవుని మనో దౌర్బల్యాన్ని వినియోగించుకొని ఆకాశంలోని గ్రహ నక్షత్ర పరివారాన్ని కనలాగా కట్టినట్టే ఫలితాలుగా కట్టారు తర్వాతివారు. వాళ్లు మోసగాళ్లని కాదు. నమ్మకంగలవాళ్ళే. నమ్మకమే ఇలాటి పనులు చేయిస్తుంది. సద్దేటుగా తగిలిందనుకోండి, మాదావా శాస్త్రం అనడం పరిపాటి.

ఈ ద్వాదశభావాలవిషయంలోనూ మన సత్త్వమే పని చేసింది. పన్నెండు రాసులకు పన్నెండూ స్థానాలు జాతక చక్రంలో. అంటే జాతక చక్రం ఆకాశం అన్నమాట. జాతకుడు పుట్టిన సమయం లగ్నం. అదే తను భావం. అంటే దేహం. తను అన్నమాట. తన పక్కన ఇలువాకిలి, డబ్బు దస్కం ద్వితీయ భావం అన్నమాట. తర్వాత తన తోబుట్టువులు. బలగం. ఇందువల్ల మనకు బలం, పరాక్రమం పెరుగుతుంది. కనుక మూడవ స్థానం విక్రమ స్థానం, సోదర స్థానం అయింది. తర్వాత ఈ అందరికీ జనని అయిన తల్లి స్థానం నాల్గవది. తల్లి పిల్లని చూపు సుఖసంతోషాలకు కోరుతుంది కదా! కనుక నాల్గవది మాతృస్థానం. సుఖస్థానం, సుఖాదులు కలిగించే వాహనాది స్థానమూ అయింది. ఐదవది బుద్ధి స్థానం. ఎందుకంటే ఈ సుఖాలు, అనుకూలాలు కల్పించే ఆలోచన కలిగించేది గనుక. బుద్ధికీ సంతతికీ సంబంధముందని మన ప్రాచీనులు నమ్మారు కాబట్టి, అది పుత్రస్థానమూ అయింది. మానవుని కుంగదీసేది అరిషడ్వర్గం. కనుక ఆరవది రిపుస్థానం; రోగస్థానం. ఏడవది తనుభావానికి సమసప్తమంగా ఎదురు (అపోజిట్ సెక్స్) కనుక భార్యాస్థానం. అది రంధ్ర స్థానాలలో ఒకటి. ఎందుకంటే భార్యవల్ల, సంసారంవల్ల కష్టాలు కలగడం సహజం గనుక. ఈ సంసారం పక్కనే మృత్యువు పొంచివుంటుందనే భావనతో అష్టమస్థానం మృత్యువు స్థానం—ఆయుస్థానం అయింది. ఈ కష్టాల పక్కనే సుఖం వుంటుందనే సూచనగా నవమస్థానం భాగ్యస్థానం అయింది. ఆ భాగ్యానికి కర్మ ఆధారం. కనుక దానిపక్కని పదవస్థానం కర్మస్థానం కర్మఫలాలు తప్పవు కనుక ఏకాదశం లాభస్థానం. పన్నెండవది వ్యయం. ఎందుకంటే లాభాలను రాబడిని సార్థక్యం వ్యయాలల్లనే గనుక. జీవితానికి చివరంటే వ్యయం, నష్టం, ఆపద వుంటాయన్న సూచనతో ఇది తను భావానికి వెనుక నిర్ణయించారు.

గ్రహాల కారకత్వాలుకూడా లౌకికదృష్టితో నిర్ణయించినటివే. చంద్రుడు మనఃకారకుడన్నారు. దీనికి ప్రమాణం 'చంద్రమా మనసో జాతః' అన్న పురుషసూక్తవాక్యం. యజ్ఞపురుషుని వర్ణించేది పురుషసూక్తం. ఈ పురుషుని మనస్సు చంద్రుడట. మనస్సు చాంచల్యం కనుక అన్న తర్వాత అది చంద్రునివలె వుంటుందనుకోవడం, గొప్ప ఉపమానం; గొప్ప రూపకల్పన. దానికి విలువలు వలనే చంద్రుడు మనఃకారకుడనడం. ఓ పెద్దమనిషి సూర్యకుటుంబమంతా మన దేహంలో వెలుగుతున్నాడు. సూర్యుడు గ్రహమండలికి కేంద్రం. దేహంలో ఆత్మాంశం సూర్యుడన్నాడు. బుధుడు సూర్యుని దగ్గరనే వుండేవాడు కనుక తేజస్సు బుధుడన్నాడు. తర్వాత శుక్రుడు—కామం అన్నాడు. రక్తం అంగారకుడన్నాడు. నల్లని వెంట్రుకలు, మొదలయినవి శని అన్నాడు. ఇలాటి కల్పనలు, సమన్వయాలు చెప్పేవాడిని బట్టి, వినే గోత్రాలను బట్టి ఉంటాయి. దేనికైనా సమన్వయం కుదరవచ్చు.

కాళిదాసంతటివాడు జ్యోతిషం నిజమంటూంటే నివ్వెరపోయే దద్దమ్మ! అనే ధోరణిలో వ్రాశారు శాస్త్రిగారు. రామాయణంలో రాముడి జాతక చక్రం వాల్మీకి ఇచ్చాడు. దానిని కాళిదాసు, కంబర్, రామదాసు అందరూ కట్టి కొట్టారు. ఇంతకూ ఒక దాంట్లో గొప్పవాడయినంతమాత్రాన, అతడు చెప్పిందంతా ఒప్పుకోవడం న్యాయం కాదు. అతని నమ్మకాన్ని బట్టి అతనన్నాడు. నమ్మకమంటే కోటి విజ్ఞానశాస్త్రజ్ఞ శిరోమణి అయిన భారతరత్న సి. వి. రామన్ కథ ఒకటి జ్ఞాపకం వస్తుంది. ఓ సూర్యగ్రహణంనాడు రామన్ మద్రాసులో సముద్ర స్నానం చేస్తున్నారు ఏదో వైజ్ఞానికుల మహాసభ జరుగుతున్న రోజులలో. గట్టుమీద పలువురు పాశ్చాత్య వైజ్ఞానికులు యంత్రాలతో సూర్యగ్రహణం పరిశీలిస్తున్నారు. రామన్ స్నానానంతరం సూర్యునికి రాహుపీడానివారణార్థం తర్పణం చేయడం ప్రారంభించారు. తోటి వైజ్ఞానికులు ఇది చూచి విస్తుపోయి, "డాక్టరుగారూ! ఏమిటిది! మీ అర్ఘ్యజలం అస్త్రంగా మారి రాహుబాధను తొలగిస్తుందా?" అని ప్రశ్నించారట. రామన్ అన్నారట కదా "That is sciennce this and is sentiment" అని. మరి రామన్‌వంటి వారికి నమ్మకమేమిటి? కనుక, ఒకదాంట్లో గొప్పవాడైతే, అన్నిటిలో గొప్పవాడనే భ్రాంతిని శాస్త్రిగారు పోగొట్టుకోవడం ఇప్పటికైనా మంచిది. కొందరు ధర్మశాస్త్రజ్ఞులు కూడా దేశాచారాలను విడనాడలేకపోవడం ఇలాటి మన సత్త్వమే.

శాస్త్రిగారు జ్యోతిషం ప్రయోగాత్మక శాస్త్రమని నిరూపించలేక, దశకాలవారు కృషి చేస్తున్నారని, భారతీయ జ్యోతిష శాస్త్రాన్ని శిరసావహిస్తున్నారని, మరికొన్ని గ్రహాలను కనిపెట్టారని, పాశ్చాత్యులు కూడా మెచ్చుకుంటున్నారనీ చంద్రగారు మూటక మని బుకాయించడం మానుకోవాలని ఆక్షేపించారు. ఈ బుకాయింపు మరీ ఇదిగా వుంది.

చంద్రుని ఆవలిప్రక్క ఫోటోలూ తీసినతర్వాత, చంద్రునిపై రాకెట్లు కొట్టినతర్వాతకూడా ఆ గ్రహం అనుగ్రహిస్తుందని శాస్త్రిగారి నమ్మకమా? చంద్రుడిప్పుడు మనఃకారకుడు కాడు; మానవజాతికి వనఃకారకుడయ్యాడని శాస్త్రిగారు గ్రహించి ఫలితాలు చెప్పగోరుతాను. సూర్యునినుండి విడివడి, ఎన్నిలక్షల సంవత్సరాలకో గట్టిపడుతూ ఇంకా ఎన్నో గ్రహాలు శాస్త్రజ్ఞుల కంటబడవచ్చు. అవన్నిటికీ ఒకే సూత్రం అన్ని అంతో ఇంతో భూగ్రహం వంటి గుణంకలవనే—కొన్నిటిలో నీరు, కొన్నిటిలో నిప్పు, కొన్నిటిలో శిల. అవి శాస్త్రిగారనుకున్నట్టు మన భాగ్యాభాగ్యాలకు ఏమీ తోడ్పడవు.

ఇక గ్రహాలకు చాతుర్వర్ణ్యమూ కల్పించారు శాస్త్రిగారిలాంటి వారు. గురుడు బ్రాహ్మణుడట. బుధుడు వైశ్యుడట. రాహువు కిరాతుడట. "చాతుర్వర్ణ్యం మయా సృష్టం" అని గీతాకారుడన్నాడు గనుక సరిపోయింది గాని, పంచమత్వం కూడా కల్పించే వారికి దేనికైనా వాకే. ఈ వర్ణ వ్యవస్థనుకూడా గ్రహాలకు నమ్మకాలా



## ఎవరి కెవరు తీసిపోరు

(మొదటి బహుమతి రు 10)

ఈ మధ్యనే ఓరోజు రాత్రి, మా హాస్టల్లో ఒక విందు జరిగింది. మేమందరం బారులుతీర్చి కూర్చున్నాం. నేనూ, మా రూంమేటు పక్కపక్కలనే ఉన్నాం. వర్కర్సు మొదటగా స్వీట్సు (కాజాలు) వడ్డించారు. ఉన్నట్టుండి లైట్లు ఆరిపోయాయి. నేను గప్ చుప్ గా మా రూమ్ మేట్ విస్తట్లో కాజాలు తీసికొని తినేశాను. ఓమూడు నిముషాల్లో కరెంటు వచ్చి మళ్ళీ లైట్లు వెలిగాయి. చూస్తే ఏముంది? నా ఆకులో స్వీటు గల్లంతు! మా రూమ్ మేటు కేసి చూశాను, ఇద్దరం ఒక్కసారి గట్టిగా నవ్వేశాం.

రవణ, విశాఖపట్నం.

* * *

## ఏ వస్తువైనా....

(రెండవ బహుమతి రూ 5)

సాయంకాలం షికారుకని బయల్దేరాం. అలా బ్రిడ్జివైపు వెళ్ళేటప్పటికి ప్రక్కనే చిన్నగలాటాలాగ అరుపులు వినిపించినయ్. ఊరిలో ఏవిషయం మాకు తెలీకుండా జరగకూడదుగా. వెంటనే హాజరయ్యాం అక్కడికి. అక్కడ పెద్ద విశేషమేం లేదు ఓచిన్న షాపు. ఫాన్సీ సామానులన్నీ పరిచివున్నయ్. మధ్యలో ఇద్దరు నిలుచుండి "ఏవస్తువైనా అణున్నరణా, త్వరపడండి బాబూ" అంటున్నారు. పెట్రోమాక్స్ లైటు కాంతిలో వస్తువులన్నీ మెరిసిపోతున్నయ్. ఇంతలో ఒకతను రొప్పుతూ వచ్చి. పాపం నయాపైసలు గావోలు పిడికిలినిండుగా పట్టుకొని, "ఇదిగో వచ్చే! అణున్నరణాలు, తీసుకొని ఆ లైటేలాపడేయ్. వెళ్ళాలి" అన్నాడు పెట్రోమాక్సు లైటువంక చూపుతూ. మాకు నవ్వాగిందికాదు. రెండవరోజు అదే ప్రదేశంలో "లైటు, గల్లాపెట్టెతప్ప ఏదైనా అణున్నరణా" అనేమాటలు వినిపించినయ్.

కె. ఎస్. రెడ్డి, గుంటూరు.

## ఏప్రిల్ ఫూల్

(రెండవ బహుమతి రూ. 5)

మా వూళ్ళో ఒక మామ్మగారు ఉండేవారు. ఆమె కడు లోభి. లోభిత్వంచేత కానీ ఖర్చు పెట్టేవారుకారు. ఆవిడ భర్త చాలా డబ్బు సంపాదించి చనిపోయాడు. ఒకరోజు పేపర్లో ఏప్రిల్ ఒకటవ తేదీనుండి కార్డువెల అర్ధణా ఉంటేదల్లా మూడుకాన్లవుతుందని ప్రచురితమయింది. ఈ వార్త మామ్మగారి చెవుల్లో పడింది. వెంటనే ఆవిడ తన పెట్లోంచి పదిరూపాయలనోటు తీసి బంట్రోతుచేత పది రూపాయల అర్ధణా కార్డులు తెప్పించింది. ఏప్రియల్ ఫస్ట్ వచ్చింది. కార్డువెల అధికమయింది. ఒకరోజు మామ్మగారు అంతకుముందు కొన్న అర్ధణా కార్డుమీద ఉత్తరం వ్రాసి పోస్టులో పడేసి రమ్మని బంట్రోతును పంపింది. వాడు కొంతసేపటికి ఉత్తరంతో తిరిగివచ్చాడు. అప్పుడు మామ్మగారు "ఏంరా ఉత్తరం వేయలేదు?" అని ప్రశ్నించారు. అప్పుడు వాడు నేను ఉత్తరం పోస్టులో వేయబోతుంటే ఒకాయన చూసి, ఆ ఉత్తరం వెళ్ళదనీ, ఆ కార్డు అర్ధణా కార్డనీ, ఆకార్డు మీద కానీ స్టాంపు అంటించితే కానీ వెళ్ళదనీ చెప్పారు" అన్నాడు. అప్పుడు మామ్మగారి బాధ ఇంతా అంతా కాదు.

ఆర్. వి. ఎస్. ఎస్. మురళీకృష్ణ,
రాజమండ్రి.

* * *

## అనుకున్నంతా అయింది

(రెండవ బహుమతి రూ. 5)

కాలేజీనుంచి రాగానే ముఖం కడుక్కుని డ్రెస్ మార్చుకొని బయలుదేరా అలా బజారుకి వెళ్దామని. వెళ్తూవెళ్తూ ఆ దగ్గరలో వున్న మా ఫ్రెండ్ హోటల్లో జొరబడాను. వాడు నన్ను చూడగానే సమయానికి వచ్చావురా, ఒక్కమాటు కౌంటరుదగ్గర కూచో. అలా మా లీడర్ దగ్గరకి వెళ్ళి అయిదు నిమిషాల్లో వచ్చేస్తాను" అంటూ సైకిల్ మీద తుర్రుమన్నాడు. తప్పదురా భగవంతుడా అనుకుంటూ కూచున్నాను. హోటల్ వచ్చేవాళ్ళతో పోయేవాళ్ళతో చాలా రద్దీగా వుంది. బిల్లులు. డబ్బు తీసుకోవటం, చిల్లర ఇవ్వటంతో నా ప్రాణం సతమత మవుతోంది. ఈ గాబరాలో ఎవడైనా డబ్బు లివ్వకుండా పోతున్నాడేమోనని ద్వారం వైపుకే కన్ను వేశాను. అనుకున్నంతా అయింది. ఒక పెద్దమనిషి మూతి తుడుచుకుంటూ పెద్దపెద్ద అడుగులు వేసుకుంటూ లోపల్నించి పోతున్నాడు. పిలుద్దామా, మానుదామా అని ఒక క్షణం డైలామాలో పడి అతనికి చిటికె వేసి "ఇదిగో మిస్టర్" అని పిలిచాను. వెనక్కి తిరిగాడు. బిక్కచచ్చిపోయాడు. "ఏమైనా టిఫిన్ తీసుకున్నారా?" అన్నాను. సమాధానం చెప్పకుండా నావంక చూస్తున్నాడు. కాలింగ్ బెల్ నొక్కాను. ఒక సెర్వర్ వచ్చాడు. "ఆయన బిలెంత?" అనడిగాను ఆ పెద్దమనిషిని చూపిస్తూ, "ఒక్క నిమిషం ఉండండిసార్" అంటూ లోపలికి వెళ్ళి అతనికి సర్వ్ చేసిం దేదో తెలుసుకొనివచ్చి "పదణాలుసార్" అంటూ బిలు ఇచ్చాడు. అన్నాడు. "ఏమండీ బిల్లేది?" అన్నాను మర్యాదగా. అతనంతకంటే మర్యాదగా జేబులోంచి బిలుతీసి ఇచ్చి మళ్ళీ తలవంచుకుని నిలబడాడు. ఇక ఏంచేసినా [illegible]దన్నట్టు. నాకు చిరాకేసింది. ఈలోపున కౌంటరుదగ్గర చాలామంది కూడిపోయారు. ఈ సందట్లో ఇంకెందరు తుర్రుమంటారో అని ఔటర్ గేట్ ని జాగ్రత్తగా చూస్తున్నాను. "ఏమయ్యా డబ్బు లేవీ?" అన్నాను సంబోధనలో ఒకమెట్టు కిందకి దిగుతూ: "లేవండీ" అన్నాడు అతిదీనంగా ముఖంపెట్టి. నాకేమాత్రం జాలి కలగలేదు. ఔను! వాడి బాబుగారి హోటలనుకున్నా, ఏమి తేరగా తినిపోడానికి. "లేదండీ అంటే ఎలాగండీ, మరి ఏంచేద్దామండీ?" అన్నాను వ్యంగ్యం ధ్వనిస్తూ. వెంటనే అతను భుజంమీదనుంచి ఒకకొత్త టర్కీ తువ్వాలు తీసి కౌంటర్ మీద పెట్టేసి గబగబా వెళ్ళిపోయాడు. ఈ తువ్వాలుగాని ఏమైనా "కేష్" కాదు కదా అనుకుంటూ తువ్వాలు తీసి భుజంమీద వేసుకొన్నాను. కాని అప్పుడు మహా చెడ్డ జాలివేసింది.

మర్నాడు అదే వేళకు ఆ హోటలుకు వెళ్ళాను. నన్ను చూడగానే మా ఫ్రెండ్ పెద్దగా నవ్వుతూ 'ఒరే నిన్న వాడు ఎవడో గాని మనకి భలేటోకరా ఇచ్చాడురా". నేను ప్రశ్నార్థకంగా చూశాను. "ఆ తువ్వాలెక్కడిదనుకున్నావు" అదే అయింది అనుకున్నంతా అయింది అనుకున్నా. "మన హోటల్లో వాష్ బేసిన్ దగ్గరది" అన్నాడు. నాకు నవ్వాలో ఏడవాలో తెలీలేదు.

బుద్ధవరపు జగన్నాధరావు
పార్వతీపురం.

# మీ దస్తూరి

[illegible] స్నానానికి కాల్వకు వెళ్ళిన అమ్మలక్కలు ముగ్గురు కాల్వరేవులో దస్తూరినిగురించి ప్రసక్తి వచ్చి వారిమధ్య సంభాషణ యిట్లా సాగింది: "ఏమండోయ్ జానకమ్మగారూ! మీవారి దస్తూరి యెంతచక్కగా ఉంటుం దనుకొన్నారూ!" అంది కామేశమ్మగారు బిందెతో నీళ్ళు ముంచుతూ. "ఆఁ! అట్లాగటండీ!... మరి మావారిదస్తూరి ఎవ్వరికీ తెలియనే తెలియదండీ — వారికొక్కరికే తప్ప" అంది జానకమ్మగారు నీళ్ళబిందె భుజాన ఎత్తుకొంటూ. "ఇంకానయం! మీవారు వ్రాసింది మీవారికైనా తెలుస్తుంది మరెవ్వరికీ తెలియకపోయినా. మరి మావారు వ్రాసింది మావారికే అర్థంకాదండీ!" అంది కమలమ్మగారు కడవలోంచి చంకన పెట్టుకొంటూ. కమలమ్మగారు అన్న మాటతో మిగతాయిద్దరికీ ఆపుకోలేనంత నవ్వు వచ్చేసింది. వారితోపాటు కమలమ్మగారూ నవ్వుకొంటూ యింటి దారితీశారు.

'దస్తూరీ'ని గురించి ప్రస్తావిస్తే - పైన అమ్మలక్కలు అనుకొన్నట్టుగా దస్తూరిలో మూడు రకాలు: అందరికీ తెలిసేటట్లుగా సుస్పష్టంగా, నిర్దిష్టంగా వ్రాసే దస్తూరియే మొదటి రకం. వ్రాసినవారికి తప్ప, అన్యులెవరికీ అర్థంగాక అవస్థలు పెట్టే దస్తూరి రెండవరకం. వ్రాసినవారికీ తెలియక తికమకలు పెట్టే దస్తూరి మూడవరకం.

మొదటిరకం దస్తూరి మెచ్చుకోదగింది. రెండవరకం ఫర్వాలేదు. మూడవరకం మన్నింపరానిది.

మొదటిరకం దస్తూరిలో కొన్నిరకాలున్నాయి. కాని రెండవ, మూడవరకాల దస్తూరిలో ఎక్కువ రకాలున్నాయి.

అక్షరాలు పట్టిపట్టి గుండ్రంగా ముత్యాల్లా వ్రాసేదస్తూరియే - 'ముత్యాలకోవ' దస్తూరి అంటారు. అక్షరానికి అక్షరానికి లింకులు తగిలిస్తూ వ్రాసేదస్తూరి 'గొలుసుకట్టు దస్తూరి'. అక్షరం అక్షరం పెనవేసుకొన్నట్టు వ్రాసే దస్తూరి 'కలిపి వ్రాత' దస్తూరి.

ఇట్లా దస్తూరిలో చాలాచాలా రకాలున్నాయి. అన్ని రకాల దస్తూరి చూడాలంటే — ఉత్తరాల్లోను, దస్తావేజుల్లోను ప్రత్యక్షంగా కనిపిస్తుంది.



కొంతమంది దస్తూరి చూస్తుంటే 'అచ్చంగా కోడికెక్కిరించిన పెంటపోగల్లే' ఉంటుంది. కొంతమంది దస్తూరిచూస్తుంటే —'అసలు అవి అక్షరాలేనా?' అనే సందేహం, సంశయం ఏర్పడతాయి. కొంతమంది వ్రాస్తారుకదా — చీమల బారులా కలిపి వ్రాస్తారు. వీటిని చదవాలి అంటే భూతద్దాలు కొనవలసివచ్చినదన్నమాటే. కొంతమంది భూతద్దాల అవసరం లేకుండా ఉండేందుకేమో — తాటికాయలంత అక్షరాలు వ్రాస్తారు. కొంతమంది వ్రాసేదస్తూరి తల బద్దలు కొట్టుకొన్నా అర్థమైచావదు. కొంతమంది వ్రాసే దస్తూరి తలాతోకా తెలియక నానా అవస్థలుపడి, ఆఖరికి ఎలాగోలాగు అర్థంచేసుకొనేటప్పటికి తల ప్రాణం తోకకి వస్తుంది.

ఎంత చదువుకొన్నా, అన్ని రకాల దస్తూరి తెలుసుకొని చదవగలిగే నేర్పు లేకపోతే నలుగురిలో నగుబాటే అవుతుంది.

పండక్కి అత్తవారింటికివచ్చిన కొత్తల్లుడికి అప్పుడే పోస్టుబంట్రోతు తెచ్చి ఇచ్చిన ఉత్తరాన్ని అందిస్తూ, ఉత్తరంలోని విశేషాలు చెప్పమందావిడ అత్తగారు. గజిబిజిగా వున్న ఆ ఉత్తరం చూసేసరికి బి. ఏ. ప్యాసయిన అల్లుడికి మనస్సులో గందరగోళం చెలరేగింది. ఎట్లా అయినా దాన్ని అర్థంచేసుకొందామని [illegible] ఆ ఉత్తరాన్ని చూస్తూ ఉంటే, అప్రయత్నంగా కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి. తిరగడమే తరువాయి రెండు కన్నీటి బిందువులు ఉత్తరంమీదపడి, అంతకుముందే గజిబిజిగ ఉన్న ఆ ఉత్తరాన్ని మరింత గజిబిజిగా చేశాయి. ఏదేమైనా అల్లుని అవస్థంతా పరీక్షిస్తున్న అత్తగారు 'ఆ ఉత్తరంలో ఏదో అశుభవార్త ఉండి ఉంటుంది. అందుచేతనే ఆయన నోటితో చెప్పలేక కళ్ళనీళ్ళు పెట్టుకొంటున్నారు' అనుకొని 'బేర్' మంది. అత్తగారు 'బేర్' మనడంతో యింట్లో వాళ్ళంతా 'బేర్' మన్నారు. వీధినిపోయే జనం యిరుగుపొరుగు జనం అంతా అక్కడికిచేరి నిర్ఘాంతపోయి చూస్తున్నారు—పాపం! ఎవరో పోయివుంటారని. ఇట్లా ఉండగా యింతలో మామగారువచ్చి, యీ గడబిడ అంతా ఏమిటూ అని అక్కడున్న అల్లుణ్ణి అడగ్గా చేతిలో ఉన్న ఉత్తరం యిచ్చాడు మామగారికి. ఆయన ఆ ఉత్తరాన్ని చదివిచూడగా అందులో అశుభవార్త ఏమీలేదు. పైగా శుభవార్తే ఉంది. "ఏమోయ్యా! యీ గోలంతా?" అని అక్కడివాళ్ళు అడిగితే — "ఆ మాయదారి దస్తూరి నాకర్థమై చావలేదు. ఏంచెయ్యను?" అని పంజాయిషీ చెప్పుకోక తప్పలేదు.

కొన్ని సందర్భాల్లో 'తానొకటి తలిస్తే దైవమొకటి తలచినట్లు' వ్రాసినది ఒకటైతే దాన్ని మరొకటిగా భావించడం

(63-వ పేజీ చూడండి)

సి. హెచ్. చలమావతి



# జీవితానికి వన్నెతెచ్చే దస్తూరీ తిలకం

"నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు. నా అక్షరాలు కన్నీటి జడులలో తడిసిన దయా పారావతాలు." అన్నారొక ఆధునిక కవి.

అందమైన మనిషిని చూసినప్పుడు ఎంత ముచ్చటేస్తుందో, అందమైన దస్తూరి చూసినప్పుడూ అంతే ముచ్చటేస్తుంది. చక్కటి దస్తూరి ఒక కళ. అంటే దస్తూరికోసం దస్తూరి అని కాదు. దస్తూరికి ఓ ప్రయోజనం ఉన్నది. మనం వ్రాసింది అవతలి వాడికి చదవటానికి వీలుగా ఉండటమే ఆ ప్రయోజనం. అక్షరాలు కుదురుగా, స్పష్టంగా, శుభ్రంగా ఉంటే చాలు, ఆ ప్రయోజనం నెరవేరినట్టే,

మనిషిని పోలిన మనిషి ఉండనట్టే వ్రాతను పోలిన వ్రాత ఉండదు. ప్రతిమనిషికీ ఒక ప్రత్యేకత ఉన్నట్టే ప్రతివాడి వ్రాతకు ఒక ప్రత్యేకత ఉంటుంది. మనిషి ముఖం చూసి ఆ మనిషి స్వభావం కొంతవరకు కని పెట్టగలం. అలాగే వ్రాతను చూసి ఆ మనిషి స్వభావాన్ని కొంతవరకూ ఊహించగలం. కాని ఒక్కొక్కసారి చాలా అమాయకంగా కనపడే ముఖం వెనక ఆలోచనలు కపటంగా ఉండవచ్చు. అలాగే దస్తూరి చాలా కుదురుగా ఉండి, మనిషి నిలకడలేని స్వభావం కలవాడై ఉండవచ్చు.

అయితే మనిషినిపోలిన మనిషి ఉండవచ్చు. అలాగే వ్రాతల్లో కూడా పోలికలు కనిపిస్తాయి. అన్నదమ్ములలో తండ్రికొడుకులలో పోలికలు కొట్టొచ్చినట్లు కనిపించినట్టే వారివారి వ్రాతల్లో కూడా పోలికలు కనిపిస్తాయి. కాని ఎంతపోలికలున్నా వ్రాతలలో అయినా తేడాలు సులభంగా కనిపెట్టవచ్చు. ఒక మనిషి వ్రాసినట్టే మరొక మనిషి కూడా వ్రాయగలిగితే అది ఫోర్జరీలకు పనికొస్తుంది.

Child is the father of the man అని వర్డ్స్‌వర్త్ విలువైనముక్క అని ప్రస్తావం చేసున్నాడు. దస్తూరి విషయంలో కూడా ఈ ముక్క వర్తిస్తుంది. దస్తూరిని గురించి చిన్నతనం నుంచి శ్రద్ధ తీసుకోవాలి. మొక్కయి వంగనిది మానై వంగుతుందా అన్నట్టు, పెద్దయిన తరవాత దస్తూరి బాగు పరుచుకోవాలంటే అసాధ్యం కాకపోయినా కష్టసాధ్యం అవుతుంది. చిన్నపిల్లలు తమ ఎదురుగా రోజూ తిరిగే తల్లిదండ్రులను చూసి, ఇతరులను చూసి ప్రవర్తన అలవరచుకుంటారు. అలాగే దస్తూరీ కూడాను. అక్షరాలు నేర్చుకున్న వెంటనే కాపీలు వ్రాయించటంలో ఇదే ఉద్దేశం. మేష్టారు గుండ్రంగా స్పష్టంగా అక్షరాలు వ్రాస్తే, వాటినే చూస్తూ, అదే మాదిరిగా వ్రాయటానికి బాలురు ప్రయత్నిస్తారు. అందుచేతనే సాధారణంగా గురుశిష్యుల వ్రాతలలో పోలికలు కనిపిస్తాయి. చిన్నప్పుడు కాపీలు వ్రాయనిపిల్లలు పెద్దయిన తరవాత దస్తూరిమూలాన చాలా చిక్కులు పడతారు. ఇంగ్లీషులో అయితే దస్తూరి బాగా లేకపోయినా ఏ టైప్ రైటింగో నేర్చుకున్నా సరిపోతుంది. తెలుగులో ఈ సదుపాయం లేకపోవటంవలన తెల్లవారి లేచిందిమొదలు కాగితంమీద కలం పెట్టనిదే సాగదు. పరీక్షలలో ఎంత తెలివితేటలు ఉండి, ఎంత గట్టిగా చదివిన విద్యార్థి అయినా, దస్తూరి బాగా లేకపోతే నెగ్గుకురావటం కష్టం. అన్నిపాయింట్లూ వ్రాయవచ్చు. శైలి అమోఘంగా ఉండవచ్చు. అయినా వ్రాతబాగా లేకపోతే పేపర్లు దిద్దేవాడు గజిబిజి అక్షరాలు ఓపికగా చదవేటంత శ్రద్ధ తీసుకోడు. రెండుమూడు పేరాలు చదివి దాన్నిబట్టి. మిగతాదంతా అదే మాదిరిగా ఉంటుందనే ఉద్దేశంతో మార్కులు ఉజ్జాయింపుగా వేసేయవచ్చు. విద్యార్థి కృతార్థుడు కావటం, కాకపోవటం దస్తూరి మీదకూడా కొంతవరకు ఆధారపడిఉంటుంది. అలాగే విద్యార్థి దశగడిచి ఉద్యోగాలలో చేరినతరవాత కూడా దస్తూరి ముఖ్యమే. కొన్ని ఉద్యోగాలకు దరఖాస్తుల్లోని దస్తూరి చూసి బాగుంటేనే చేర్చుకుంటారు. దస్తూరి బాగులేని ఉద్యోగికి అధికారి అక్షింతలు తప్పవు. ★

MKGandhi

Romain Rolland

A. Einstein

Jawaharlal Nehru

ప్రసిద్ధపురుషుల సంతకాలు:
మహాత్మాగాంధీ, ఆల్బర్ట్‌ఐన్‌స్టీన్, రోమారోలా, జవహర్‌లాల్ నెహ్రూ

# దస్తూరి-తీరుతెన్నులు

సి. హెచ్. శంకరశాస్త్రి



రాతలన్నిటిలోకీ ఎవరికీ అంతుపట్టని రాత బ్రహ్మరాత. ఆయన చిన్నతనంనాటికి బడులూ, కాపీలూ వరవళ్లూ లేక, సెర తీసుకోవే పెద్దవాళ్ళు లేక బ్రహ్మరాత బ్రహ్మరాతలా తయారయి ఉండాలి. ఆయన రాత ఆయనకే బోధపడక కాబోలు బ్రహ్మరాత తప్పించ తరమే అన్నారు. రాసిందివిటో తెలిసీగదా మార్చడానికి.

అయితే నన్నంతలో డాక్టరు రాత సుట్టు కాంపౌండరు పసిగట్టినట్టు, బ్రహ్మరాతని జ్యోతిష్కులు చదువుతారు. ఎంత జాగ్రత్తగా చదివినా బొత్తిగా బ్రహ్మలిపి కొంతైనా తప్పుతూ ఉంటారు. ఇలా బ్రహ్మరాతని చదవటం కొందరు మనుషులకు సాధ్యపడితే పడిందిగాని, కొందరు మనుషులు రాసే రాత చదవడం బ్రహ్మతరం కాదు.

ఈవిధంగా, కంగారు మనిషి మాటలా బొత్తిగా బోధపడని విధంగా రాసే వాళ్ళలో డాక్టర్లు, దస్తావేజులు రాసే కరణాలు, పత్రికా రచయితలూ ముందు తల్చుకోవలసినవారు.

డాక్టర్లగురించి ఒకాయనకి పెద్ద అనుమానం ఉంది. అలా గజిబిజిగా రాసే వాళ్ళని చిన్నతనంలోనే పసిగట్టి వీడు డాక్టరై తీరుతాడని ఆ మేరకు బళ్లో చదవేస్తారా, చదవేశాక వాడు ఏ చిన్నదాన్నో వలచి ఆ పిల్ల కన్నెత్తి చూడక పన్నెత్తి పలక్కపోగా ఆయొక్క విచారంలో భగ్నవీణ వాయిస్తూ పిచ్చి పిచ్చిభావాలూ బొమ్మలు గీస్తుంటేవరకూ—కొన్నాళ్ళకు అదే స్థిరపడి అదే అతగాడి రాతగా తయారవుతుందా అని.—

ఈ అనుమానం, అప్పైన మరో భయం కూడా ఉంది పైచెప్పిన పెద్దమనిషికి — ఈ డాక్టర్లురాసే మందుచీటీలు పట్టికెళ్ళి కాంపౌండరికిస్తే వాడికిమటుకు సరిగా బోధపడేడిసిందా,— వాడు ఓ మాదాని కొహటి చదూకుని కళ్ళమంటలికి కడుపునొప్పిమందు ఇఘోరిస్తే ఇవతలివాడి బతుకేం గానూ అని.

ఈ అభిప్రాయంవల్లనే లోకంమీద వాడు ముస్సిన్నదూ కనిపించని ఎరుగని కొత్తకొత్త రకం జబ్బులు రివాజవుతున్నాయని కూడా ఒహాభయం ఉంది.

ఇందు కాస్కారణం లేకపోలేదు. ఒకసారో పెద్దమనిషి తనకోక డాక్టరు రాసిన ఉత్తరం చూసి అది కొరుకుడుపడక ఊరంతా తిరిగాడు. అంజనం వేయించి చూశాడు. చిలకలపూడివెళ్ళి సోది అడిగాడు. ఎవ్వరిగానా కాంపౌండరికిచ్చి చూడవయ్యే అన్నాడో కాయిన చివరికి.

ఈయన ఆలేఖని అప్పుళ్ళో ఆ స్పత్రి కాంపౌండరుకిచ్చాడు. ఆయన దానికేసి ఓ పదినిముషాలు తేరిపారజూసి తలూపి. పదినిముషాల తరవాత ఒక ఎర్రటి మందు కలిపి తెచ్చి తక్కువ బల్లమీద పెట్టి 'మందు రూపాయి, సీసా బేడా, ముప్పూటలా భోజనం తరవాత నీళ్ళలోకలిపి ఔన్సొక డోసుగా పుచ్చుకోండి. కారం తినకండి' అని చెప్పాడు.

ఈయన నిర్ఘాంతపోయి ఆ మందూ ఈ లేఖాపట్టుకుని హాగుగూ రెళ్ళి ఆ డాక్టర్ని అడిగాడు. అయినా దానికేసి తేరిపార చూసి, మొదాని కగి మందు చీటీ మటుక్కాదని తేల్చాడు. తెగించి, అప్పైన ఆలోచించి. పాతవిషయాలు గుర్తుకు తెచ్చుకొని, తనమిత్రుడి పుత్రుడికి పెళ్ళి సంబంధం చూడాల్సిందిగా ఈ ఉత్తరంలో రాసినట్టు జ్ఞాపకంఅని చెప్పాడు. ఇది కథ కాని, కథ కాని కథగాని అయితే కావచ్చు కాని అసత్యం కాదు. సత్యానికి మరీ అమడ దూరానమటుకు లేదు.

* * *

పత్రికలలో—ముఖ్యంగా నిముషాలతో పరిగెడుతూవుండే వార్తాపత్రికలలో హడావుడిని బట్టి వడి వడిగా వ్రాసే పత్రికా రచయితల వ్రాతకూడా ముత్యాలకోవలా ఉండదు. ఒకసారి ఒకపత్రికా రచయిత ఢిల్లీలో వున్న ఒకమిత్రుడికి ఇంగ్లీషులోనూ తెలుగులోనూ ఉత్తరం రాశాడు. సహజంగానే అతని కది అంతుపట్టక తెలుగుభాగాలను తెలుగు మిత్రులకీ, ఇంగ్లీషు భాగాలను అభావ రూపరేఖా విలాసాలు బాగా ఎరిగిన వారికీ పంచిపెట్టి తాత్పర్యం



# రాజధాని కబుర్లు

ప్రవీణ్

## నాట్యసంఘ కార్యక్రమాలు

"నాథా! స్నానమునకు వేడి నీళ్ళు సిద్ధముగా నున్నవి" అని వయ్యారంగా రత్నాంగి గదిలో ప్రవేశించి, విసనకర్రతో విలాసంగా విసురుకుంటూ నిష్క్రమిస్తుంది స్థానం వారి చిత్రాంగి ధర్మవరం వారి 'సారంగధర'లో. న్యాయవాదులు నల్లకోట్లు, తెల్ల కాలర్లతో ప్రత్యక్షమౌతారు. కలెక్టరాఫీసు చప్రాసీలా మూడుసార్లు సాక్షుల్ని పేర్లుపెట్టి పిలుస్తాడు రాజరాజు న్యాయస్థానంలో భటుడు.

ఈ విధంగా నవ్వుకుంటూ [illegible] మన నాటకశిల్ప పౌరాణిక నటులు. పద్యాల నాటకాలు బహుశః తెలుగువారి సొత్తు. చిలకమర్తివారు, ధర్మవరంవారు, తిరుపతి వెంకటకవులు, వేదంవారు చక్కని నాటకాలు రాసిచ్చారు. నాటకాలు చక్కనివేఐనా, చరిత్రపై ఆధారపడినవి కావు. ప్రతిభావంతులైన నటులు పాత్రలకు ప్రాణంపోశారు; కాని, ఆ నాటకాలకు సంబంధించిన వాతావరణాన్ని విస్మరించారు. ప్రతిభావంతులు కాని నటులు ప్రదర్శించినప్పుడు, నాటకాలు వాస్తవికతకు దూరమైపోయాయి. పద్యాల నాటకాలపై విద్యావంతులైన ప్రేక్షకులకి ఏహ్యత కలిగింది.

దేశంలో ఔత్సాహిక నాటకబృందాలు వృద్ధిలోనికి రావడానికి కొంతవరకు కారణం పరిషత్తు. పరిషత్తు సమావేశాలు ఉత్సాహం కల్పించినంత అధికంగా అనుభవాలు అందివ్వలేదు సరైనవి. ఈ దృష్టితో మాస్టే ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం నిర్వహిస్తున్న అకాడమీ తరగతులు ప్రశంసింపతగ్గవి; వారి ప్రయత్నాలు హర్షింపతగినవి!

క్రిందటివారం సంభాషణల విడిచిపెట్టవలసివచ్చిన నాట్యసంఘోత్సవాల సమీక్ష సంక్షిప్తంగా ఇది: వారం రోజులపాటు జరిగిన ఈ ఉత్సవాలు శ్రీ చినముక్కల సుబ్బారావు నాదస్వరవాద్యంతో ప్రారంభమయ్యాయి. కుమారి కళ్యాణి, రాజకుమారి, కుమారికలు అంబి, దేవి నృత్యప్రదర్శనాలు ఇచ్చారు. ఆర్థికమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి ప్రారంభోపన్యాసం చేశారు.

ఆ రాత్రి పడిపాటి వెంకటచలం రచనకి అనుసరణ 'చిత్రాంగి' నాటక ప్రదర్శన జరిగింది. నాటకం రచన, ప్రదర్శన రెండూ ప్రయోగాత్మకాలే. నాయకుడికి ఆ కాల ప్రతిమాల వస్త్రాల రెండింటికి రెండు రంగభాగాలను కేటాయించి, ఒకే సెట్టింగుతో ఆధునిక పద్ధతులలో ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘ విద్యార్థులు ప్రదర్శించిన నాటకం ఇది. చలం సంభాషణా చాతుర్యాన్ని నటీనటులు పూర్తిగా ఉపయోగించుకోలేకపోయారనే చెప్పాలి. 'రాజారాజా' మాత్రం తన పాత్రను చక్కగా నిర్వహించుకున్నారు. 'జగన్నాథం' కొన్ని సంభాషణలు చక్కగా చెప్పినా, అవసరం లేని 'సస్పెన్సు' వాక్యాలు మధ్యపెట్టి నాటకం ముందుకు సాగకుండా చేశారు. మిగిలిన పాత్రధారులు మెప్పించలేకపోయారు. నాటకం ఇంకా తొందరగా సాగితే, పటుగా ఉండేది. మొత్తానికి. సీరియల్ నాటకంలా తయారైంది: 'వచ్చేవాక్యం మళ్ళీ వారం' అన్నట్టు.

మిగిలిన నాటకాలు; సహా ప్రజానాట్యమం బృందంవారి తమిళ నాటకాలు రెండు, నాటక సమితి (సికిందరాబాదు) వారి 'కాలచక్రం'; రాఘవకళా సమితి (రాజమండ్రి) వారి 'స్వర్గలోకం'; అభ్యుదయ కళాసమితి (కర్నూలు) వారి 'జన్మహక్కు'; రాఘవ కళాకేంద్రం (విజయవాడ) వారి 'దిగంబర రహస్యం'; నాట్యవిద్యాలయం హిందీశాఖ ప్రదర్శించిన '[illegible]'. సీతాపాటి బృందం ప్రదర్శించిన 'సతీ సావిత్రి'. నాటకాల పోటీలో 'జన్మహక్కు' ప్రథమ బహుమతి గెలుచుకుంది.

* * *

### రచనలా? రచయితలా?-(2)

అఖిలభారత తెలుగు రచయితల మహాసభ తాత్కాలిక ప్రయోజనాల దృష్టినుంచి పరిశీలిస్తే, విజయవంతమైందనే చెప్పాలి కాని - ఈ మహాసభలో లోపాలు అనేకం కనబడ్డాయి. ఈ లోపాలను పరిహరించకపోవడం ఒక లోపం ఔతుంది

క్రిందటి వారమే ఈ లోపాలనుగురించి



### అమ్మా కె. శారదాంబా

నీవు వెళ్ళినప్పటినుండి, నీకొరకు వెదకి వెదకి దిగులుతోను గుండెజబ్బుతోను కృశించితిని. లోకులమాటలవలన చెరగద్దు. వెంటనే తిరిగివచ్చి నీయిష్టానుసారముగా నావద్ద నుండుము. నాకు దిక్కు కల్పింపుము. అపాయములో చిక్కుకొనవద్దు 15 సం॥ అమ్మాయి. 5' 4". ఎత్తు చామనచాయ మధ్యస్థమైన లావు. పెద్ద సోగకళ్ళు సోగముక్కు. అమాయకురాలు, మోసములో పడిపోయినది. అప్పగించినవారికి 50 రూ. బహుమతి ఇవ్వబడును ఎన్ సుందరమ్మ (నర్సు) అరండేల్ పేట 1 అడ్డరోడ్డు 11 వ లైను. గుంటూరు-2.



# తెలుగు వెలుగులు 36

"ఆతడనేక యుద్ధముల నారియుం తేరిన వృద్ధమూర్తి" అని తిరుపతి వెంకట కవుల పాండవ విజయంలో అర్జునుడు తాత భీష్ముని గురించి సారథి కృష్ణునితో అంటాడు. ఈ పద్యాన్ని గురించి అన్నా, విన్నా శ్రీ అద్దంకి శ్రీరామమూర్తి గారు తప్పక జ్ఞాపకం వస్తారు.

అంతే కాదు. శ్రీరామమూర్తి గారిని తలచుకున్నా ఈ పద్యం జ్ఞాపకం వస్తుంది. ఈ పద్యం రాని, పాడని తెలుగువాడు సాధారణంగా ఉండడు. తిరుపతి వెంకటకవుల కవిత అద్దంకి కంఠంలో పడి కర్ణామృతమైంది. ఇలాగే పానుగంటి వారి పాదుకాపట్టాభిషేకంలోని దశరథుని పద్యాలు, కందుకూరి వారి కావ్యమహార్షి పద్యాలు, రాఘవుని కాళ్ల గజ్జెలు లాగా ఘల్లు ఘల్లుమంటూ అందరి కాహ్లాదంగా వినబడుతూ వళ్లు పులకరింపజేస్తాయి. పాడేవాణ్ణిబట్టి పద్యం బాగుంటుందా పద్యాన్నిబట్టి పాట బాగుంటుందా అంటే, నాటకాన్నిబట్టి నటన బాగుంటుందా, నటనబట్టి నాటకం బాగుంటుందా అన్నట్టే ఉంటుంది ఇవి పరస్పరాశ్రితాలు. అయితే సాహిత్య ప్రచారానికి నాటక ప్రదర్శనలు తోడ్పడినట్లు మరేవీ తోడ్పడలేదు అంటే అతిశయోక్తి కాదు. ఆ విషయంలో సినిమా ఎందుకూ కొరగాకుండా పోయింది.

అద్దంకి శ్రీ రామమూర్తి కంఠం శంఖనాదంలాగా ఆరంభమై ఘంటానాదంలాగా నిలిచి మోగుతుంది. అది తలచుకుంటే వినబడుతుంది.

ఆయనది కేవలం నాటక సంగీతం కాదు. పారుపల్లి రామకృష్ణయ్యగారివద్ద శుశ్రూష చేసి శాస్త్రోక్తంగా సంగీతవిద్య నభ్యసించారు. పాటకచ్చేరీలు చేసేవారు. అంగుళ కో "ఎంతని నే వర్ణింతును శబరీభాగ్యము' అన్న కృతి నుండి జగదీశుని మాయలు వర్ణింప ఎవరి తరంబు అన్న నాటకం చివరకు చక్కగా శ్రావ్యంగా స్పష్టంగా లయబద్ధంగా పాడేవారు.

త్యాగయ్య కృతులనుంచి లల్లాయి పదాల వరకు పాడినట్లే, పెద్ద వేషాలనుండే చిన్న వేషాలవరకు రమ్యంగా వేశారు. దశరథుడు, ధర్మరాజు, కర్ణమహారాజు, రాజరాజ నరేంద్రుడు, హరిశ్చంద్రుడు, చివరికి విత్రకుడు మొదలైన భిన్న స్వభావాలు కల పాత్రలను ధరించి రంజింపచేశారు. ఆస వేషం సుగ వేషం వేసేవారని కొందరు పూర్వనటులనుగురించి వారి అభిమానులు, గొప్పగా చెబుతారు గాని వేనవేల లక్షణాలు గల పాత్రను వేసి ఒప్పించటం అంతకంటె కష్టం. కష్టం కాకపోయినా వారి ప్రతిభను ఏమాత్రం తీసిపోదు శ్రీరామమూర్తిగారి ప్రతిభ.

శ్రీ రామమూర్తిగారు వేసినపాత్రలన్నీ ఒక ఎత్తు, ఆయన దశరథుడు ఒక ఎత్తు. ఆ పాత్రను ఆయన నటించి ఒప్పించినట్లు మరెవరూ ఒప్పించలేదు. ఒప్పించలేరు కూడాను. "ఎవ్వాని చేతిమీదుగా వెడలిపోవుటకు నేను వేయి పుణ్యకు మ్రొక్కుచుంటి, అట్టి రఘురాముమీద నటించుకొందు సాకిదా కోరు సంకటమా పాలిమాని". అని కైకేయికి చెప్పినప్పుడు, "పదికోట్లపులను లేనిపల్లెనైనను రామభజన మందిరమొందు వరలుగాత! ఎట్టి వ్రాతయు శ్రీరామ చుట్టబడక వ్రాయబడకుండుగాక" అని అసువులకగే రాముణ్ణి దీవించినపుడు శ్రీరామమూర్తిగారి నటనా పాండిత్యం పానుగంటివారి కవితా సౌందర్యాన్ని అధిగమిస్తుంది. నాటకం చూసిన తర్వాత కొన్నాళ్ళవరకు అద్దంకివారి దశరథుని ఆవేదనాస్వరం వెంటబడి వినబడుతుంది. అద్దంకి మరుగుపడిపోయి దశరథుడే కనబడుతాడు.

దశరథుని తర్వాత మరపురాని వేషం ధర్మరాజు. "ఆర్తాత్ములైన కవులు... ఆహా కర్ణాదికి జాగా చేగ" అను పద్యంలో అభిమన్యుని మరణానంతరం అతని సాపురేఖలు తలచుకొని ధర్మరాజు ఏడుస్తూ ఉంటే ప్రేక్షకులందరికీ ఏడుపొచ్చేది, కాని ఏమిటా దీనమైన పద్యంలో వినిపిస్తున్నా అన్న భావం కలిగేది కాదు. గద్యంలో మాట్లాడుతూ ఉంటే ఎంత స్వాభావికంగా ఉంటుందో ఈయన పద్యధోరణి అంత స్వాభావికంగానూ ఉంటుంది. పద్యాన్ని తగిన రాగంలో పాడుతూ ఉంటే రాగవాదం పద్యభావాన్ని రసవత్తరంగా చిత్రించేది గాని రాగాన్ని తెగేదాకా పాడేవారు కాదు.

మూడు దశాబ్దాలు పైగా ఆంధ్ర నాటక రంగంలో విహరించి అనేక పాత్రధారులుగా ఆరితేరిన వృద్ధమూర్తి శ్రీ అద్దంకి శ్రీరామమూర్తి. ఆయన తరానికి, ఆయన కోవకు చెందిన నటులలో ఆయనే ఆఖరివాడు. ప్రభుత్వ అకాడమీలు వారిని గురించి గౌరవించలేకపోయినా, ఆకాశవాణి వారిని ఏ ప్రయోక్తగానో ఉపయోగించుకోలేకపోయినా, నాటకరంగంలో వారి స్థానానికి లోటెప్పుడూ రాదు. ★



# నల్ల పిల్లి..

కె. రాంబాబు

కాకినాడనుంచి యిప్పటికి దాదాపు అర డజను ఉత్తరాలు వచ్చినాయి, పిల్లను చూచుకుని వెళ్ళమని. కాని నాకు అండగా నిల్చునే పెద్దలు యెవరూ లేరు, ఒక్క మామయ్య తప్ప. అతనూ ఎక్కడో దూరపు బంధువు. మా అమ్మకు అన్నగారవుతారు. చివరకు ఆ మామయ్యను తీసుకుని కాకినాడ వెళ్లాలనుకున్నాను. జీవితం అంతా దొంగలతో, ఖూనీ కేసులతో గడిపి, పోలీసు ఇన్‌స్పెక్టర్‌గా రిటైర్ అయి. పిల్లలు యెవరూ లేనందున భార్యతోపాటు హాయిగా కాలం గడుపుతున్నాడు మా మామయ్య. ఆయన అదొక తిరహా మనిషి. ఎవరైనా కనబడితే చచ్చినా వదలడు. వయస్సులో తను పట్టుకున్న పెద్ద పెద్ద గజదొంగల గురించి, తాను సాధించిన ఖూనీ కేసులగురించి సోదిలా చెప్పుకుపోతూంటాడు. వినేవారికి విసుగు గాని ఆయనకు విసుగనేదే లేదు.

అనుకున్న ప్రకారం మామయ్యా, నేనూ కాకినాడకు బయలు దేరాము. ట్రైన్‌లో ఆయన బాధ ఎలా భరించాలో అని అనుకుంటూ, ఏదో పుస్తకం తీసి చదువుకుంటున్నా. కాని నా మనస్సు ఆ పుస్తకం మీద లేదు. చీకటిని చీల్చుకుంటూ రైలు పోతూంది. ఏవేవో ఆలోచనలతో అంతకంటే వేగంగా నా మనస్సు పరుగెత్తుకు పోతూంది. బయటకు చూచాను. ప్రక్కన వున్న చెట్లు తలలు విరిచుకుంటూ వెనుకకు పరుగులెత్తుతున్నాయి. నా మనస్సులో యెన్నో ఆలోచనలు నా గతానికి

## నల్లపిల్లి

లంకెలు వేసుకున్నాయ్. ఇంతలో యెవరిదో బరువైన చెయ్యి నా వీపుమీద పడింది. నా ఆలోచనలకు అంతరాయం కలిగింది. తిరిగి చూచాను. మా మామయ్య నోట్లో అరంగుళాల చుట్టను బయటకు తీసి అదేపనిగా నవ్వుతున్నాడు. "ఏమిటోయ్! అంత పరాధీనంగా వున్నావ్? ఇది ముందు, ముందు పనికివస్తుందిలే దాచుకో!" అన్నాడు. ఆ స్వరంలో మరింకేదో స్వరం వినపడింది. మా మామయ్య ప్రక్కనే వున్నాడు మరో ఆయన. ఫుల్ సూటులో వున్నాడు. ఆయన తలమాస్తుంటే ఈమధ్య టోకియోలో జరిగిన 'బట్టతలల పోటీ' గుర్తుకు వచ్చింది. పాపం! ఈయన ఇండియాలో పుట్టారు. టోకియోలో పుట్టివుంటే ఫస్టు వచ్చేవాడు అనిపించింది.

ఇంతలోనే మా మామయ్య నా మతిమరపు గురించి వ్యాఖ్యానించుతూ, అసలు యీ మతిమరుపువల్ల యే విధంగా దొంగతనాలు జరిగేది, ఆ మతిమరుపువల్లనే యే విధంగా దొంగలు దొరికేది చెప్పుకు పోతున్నాడు. ఆయన సర్వీసులో యెన్నో దొంగల ముఠాలను అర్ధరాత్రి అవలీలగా బంధించాడట. తాను ఒకరోజున దొంగలకు చిక్కిపోతే వాళ్ళు మామయ్యను మూడురోజులు బంధించి, మంచినీళ్ళు కూడా యివ్వకుండా నానా హింసలు పెట్టారట. కాని చివరకు తెలివితేటలతో వారి బారినుండి తప్పించుకుని వచ్చి, తరువాత తన సిబ్బందిని తీసుకొని ధైర్యంతో యెదిరించి, పట్టుకుని ప్రభుత్వానికి అప్పచెప్పి, యెన్నో బహుమతులను పొందాడట.

ఒక క్రిస్మసు రోజున తనకు బహుమతులతోబాటు ఒక స్త్రీ యెడమచెయ్యి బొటనవ్రేలు, నగిషీ పని చేయబడిన చక్కని దంతపు పెట్టెలో పెట్టి పంపబడిందట. చివరకు అదొక పెద్ద కేసుకు దారితీసిందట. ఆ కేసు కూపీ తీస్తుంటే తాను యెదుర్కొన్న కష్టాలు, తాను చూపిన ధైర్యం చెప్పుకు పోతున్నాడు. ఆ మాటలు వింటుంటే నాకు చాల ఆశ్చర్యం కలిగింది. మా మామయ్య యెంత పెద్ద గజదొంగనైన యిట్టే పట్టేయ గలడన్నమాట!

ఇంతలోనే మామయ్య ప్రక్కనే కూర్చున్న పెద్దమనిషి మొదలు పెట్టాడు. ఆయన పూర్వం పబ్లిక్ ప్రాసిక్యూటర్ గా పనిచేసేవాడట. ఎన్నో కూని కేసులు అవలీలగా తేల్చి పారేసేవాడట. సాక్ష్యమే జీవనాధారంగా పెట్టుకున్న యెంతోమంది కోర్టు పక్షులను క్రాస్ యెగ్జామిన్ చేసి మూడు చెరువుల నీరు త్రాగించేవాడట. తాను కోర్టులో క్రాస్ యెగ్జామిన్ చేస్తుంటే ఒక్కొక్కసారి జూరీలు, జడ్జీకూడా బేజారెత్తిపోయేవారట. ఈ విధంగా సాగిపోతూంది వారిద్దరి సంభాషణ. ఇద్దరిలో యెవరూ తీసిపోరు. ఇంతలోనే టిక్కెట్టు కలెక్టరు వచ్చాడు. మా రెండు టిక్కెట్లు చూపించాను. తరువాత టి. సి. ఆయన దగ్గరికి వెళ్ళి టిక్కెట్టు అడిగాడు. ఆయన టి. సి. వైపు కోపంగా చురచుర చూశాడు. టిక్కెట్టు చూపమని అడగటం వారిని చాలా అవమానం చేసినట్టు గాబోలు! ఆయన కోపంగా కోటు జేబులో చెయ్యి పెట్టాడు.

అంతే. ఆయన గుడ్లు బయటకు వచ్చేశాయి. వట్టి చెయ్యి జేబులోంచి బయటకు వచ్చింది. ఆయన ముఖాన్ని జేగురు రంగు కమ్ముకొంది, అమాంతంగా గట్టిగా అరిచాడు "ఎవడో రాస్కెలు నా పర్సు కొట్టేశాడు" అని. కాని ఆ టి. సి. తాపీగా, "అవంతా మాకు అనవసరం, ముందు మీ పేరు చెప్పండి, ఎక్కడ ఎక్కారు?" అన్నాడు. దాంతో ఆయన తోక త్రొక్కిన త్రాచులా లేచాడు, "సెన్సు లేకుండా మాట్లాడుతావేం?...పిక్ పాకెటింగు జరిగి ఓ ప్రక్కన నేను గోడు పెడుతుంటే, పేరు చెప్పమంటావు?...ముందు ట్రైను ఆపి పోలీసుల్ని పిలువు" అన్నాడు అధికార ధోరణిలో. టి. సి. గతుక్కుమన్నాడు, ఆయనెవరో పెద్ద ఆఫీసరనుకొని. అంతలోనే మా మామయ్య లేచాడు. గంభీరంగా ముఖం పెట్టి "డామిట్... నేను యీ కంపార్టుమెంటులో వుండగానే చోరీ చేశాడా? వాడికి ఎన్ని గుండెలు? ఆగండి...వాడిని యిప్పుడు యిక్కడే పట్టి అప్ప చెబుతా" అంటూ హుంకరించాడు. వెంటనే ఆయన వైపు తిరిగి తన మామూలు పాతబడిన అధికార ధోరణిలో "ఏమండీ! మీ పర్సు యింతకు ముందు యెప్పుడు చూచుకున్నారు? అది, మీరు యీ కంపార్టుమెంటులోకి యెక్కినప్పుడు వుందా?...అందులో యెంత డబ్బు వుంది? మీ టిక్కెట్టు నంబరు నోటు చేసుకున్నారా?" అని యేకరువు పెట్టాడు. అవతలి జవాబులు వినకుండానే కంపార్టుమెంటులో గుసగుసలు బయలుదేరినై. "ఎక్కడివాళ్ళు అక్కడే వుండండి. ఎవ్వరూ కదలడానికి వీల్లేదు" తన పాత పద్ధతిలోనే అరిచాడు మామయ్య. తాను రిటైరు అయిన సంగతి మరచిపోయాడులాగుంది! పాపం! ఇంతలో ఓ చిన్న స్టేషను వచ్చింది. ఒక్క పిట్టనుకూడ జారిపోకుండ వేయికండ్లతో కాపలా కాస్తున్నాడు మామయ్య. టి. సి. రైలుదిగి గార్డును, పోలీసుల్ని వెంటబెట్టుకుని వచ్చాడు. ప్రక్క పెట్టెలోనే కూర్చున్న సబ్ ఇన్స్పెక్టరు గారుకూడా వచ్చారు. ఆయన వచ్చిరావటం తడవుగా మామయ్యకు విష్ చేశాడు. మామయ్యవలన జరిగినదంతా విన్నాడు. పర్సు పోగొట్టుకొన్న వ్యక్తి ఒక్కటే గోల పెడుతున్నాడు. తన పర్సులో యెనిమిది వేల రూపాయలు వున్నాయని, తన కొడుకు కాలేజిసీటుకోసం డొనేషన్ కట్టాలని, వెళుతున్నానని ఒకటే మొర పెట్టుకున్నాడు పాపం! పోలీసులదర్యాప్తు ప్రారంభమైంది. క్రిందకు యెవరిని దిగనియ్యలేదు. లోపలికి యెవర్ని యెక్కనీయలేదు. పోలీసులు అందరిదగ్గరకూ వెళ్ళి సోదా చెయ్యడం

(55-వ పేజీ చూడండి)

---

రెవెన్యూ బోర్డులో పక్క పక్కనే కూర్చుని పనిచేసే ఇద్దరు గుమాస్తాలున్నారు. ఒకతను రెడ్డి. ఐదింటికల్లా పని తెమిలి పోతోంది. రెండో అతను రావు. రాత్రి ఎనిమిదిదాకా తెములడం లేదు. ఫైళ్లు గుట్టలుగా పడిపోతున్నాయి.

'మీ కింత కం ఏవిటండీ?' అన్నాడు రావు ఒకనాడు.

"ఏవుంది. నాకు తెమలని కాయితాలూ ఫైళ్లూ పోగేసి రావుకి రిఫర్ చెయ్యమని రాసి పంపేస్తున్నా. ఇంత పెద్ద డిపార్టుమెంటులో ఏ రావో ఎవడికి తెలుసు. మొత్తానికి నన్నొదిలి పోతున్నాయి" అన్నాడు రెడ్డి.

"ఓ...మీరన్నమాట ఈ చెత్త నా నెత్తిన తోస్తున్నది" అన్నాడు రావు లేచి చొక్కా చేతులు మడత పెట్టుకుంటూ.





# జీవనగంగ

పురాణం సూర్యప్రకాశరావు

(గత వారం తరువాయి)

"ఎలా వుంది కథ?"

"చదరంగంలో ఆటలా వుంది."

"అవును వును బాగా చెప్పావు. అన్ని చిక్కులూ వున్నాయి యీ కథలో. కాని విషాదాంతం అవుతుందో. సుఖాంతం అవుతుందో చూడాలి"

"మనం ఎలా అనుకుంటే అలా అవుతుంది. దైవం అనుకూలించక అనుకోని సంఘటనలు జరుగుతే చెప్పలేం."

"కావాలని అనుకుంటే సరిపోదు. ఆచరణలో అందుకు ప్రయత్నించాలి. తప్పకుండా సుఖాంతం అవుతుంది." అన్నాడు లక్ష్మణరావు.

ఉత్తుంగ తరంగాలతో ఘోష పెట్టే ఈ అనంతమైన సముద్రాన్ని చూస్తుంటే ఒక హృదయం ఇలాగే ఘోష పెడుతూంటుంది కదా అనే తలపు వచ్చింది మల్లిబాబుకి. రత్నమ్మ ఈనాటికి ఆయింటి ఇల్లాలు అయివుండేది. తల్లి మృత్యుముఖం మనసులో మెదలి బీభత్సం చేసింది. అతను క్షణం రెండు కాళ్ళ మధ్య తల బిగించుకుని మౌనంగా ఉండిపోయాడు

"ఏమిటోయ్ దీర్ఘంగా ఆలోచిస్తున్నావు?" అని పలకరించాడు లక్ష్మణరావు.

మల్లిబాబు స్మృతిలోకివచ్చి "ఏమీ లేదు. ఊరికే అలా కూర్చున్నాను" అని సర్దుకోబోయాడు.

లక్ష్మణరావు చలించిన హృదయంతో "మల్లిబాబు వాళ్ళ అమ్మని తల్చుకోని రోజు వుండదు." అన్నాడు రాధవైపు తిరిగి.

"మనసు ఎప్పుడు వికలంగా వున్నా ఆమె తప్పకుండా జ్ఞాపకం వస్తుంది. ఆమె నాతో కూడా వున్నట్టుగా ఫీలవుతూంటాను."

లక్ష్మణరావు మల్లిబాబుకి దగ్గరగా జరిగి "నీ మనసులో ఏదో వుంది. అప్పుడప్పుడు చాలా బాధ పడుతూంటావు. అదేదో మాతో చెప్పి సానుభూతి పొంది మనసు కుదుట పర్చుకోరాదూ?" అన్నాడు.

"క్షమించండి. ఈ నోటితో ఆవిషయాలు చెప్పలేను. ఎప్పుడైనా అవసరం వస్తే చెబుతా. అలాంటి అవసరం రాకూడదనే అనుకుంటున్నాను."

"బహుశః నీ ఒంటరితనం నిన్ను మరింత కృంగదీస్తోందేమో"

"కాదన్నా కానీ ఏం చెయ్యను?"

"ఒక మంచి సంబంధం చూసుకుని వివాహం చేసుకోరాదూ?"

"చదువు పూర్తి కావాలి"

"బి.ఎ., పూర్తిచేసి ఆపేస్తావా?"

"లేదు ఇంకా పైకి చదవాలని ఉంది"

"అయితే నా సూచన పరమదండుగ అన్నమాట"

మల్లిబాబు నవ్వేసి 'అంతేగా మరి' అన్నాడు. రాధమ్మ పవిట అడ్డం పెట్టుకుని అక్కవైపు తిరిగి నవ్వుకుంది. జానకమ్మ కూడా ఈ సందర్భంలోని హాస్యాన్ని స్వీకరిస్తూ "మీ సూచన చాలా బాగుంది" అంది భర్తనుద్దేశించి.

మల్లిబాబు జానకమ్మవైపు తిరిగి "ఆయన సూచన చెడ్డదని నే ననను. ఆయన చాలా మంచి సూచనే చేసారు. నా అభిప్రాయం ఎలా ఉంది. చెప్పండి." అన్నాడు.

లక్ష్మణరావు కలగజేసుకుని "నీ అభిప్రాయం దివ్యంగా ఉందబ్బాయి. కాని ఒక విషయం మటుకు తెలుసుకోవాలి. ఇలా దిగులుపడుతూ కూచుంటే మటుకు లాభం లేదు." అంటూ ఇసుకమీద వెనక్కి చారబడ్డాడు.

రాధకి మల్లిబాబుకి మధ్య ఇప్పుడు ఏ అడ్డూ లేదు. జానకమ్మ సముద్రంవైపూ, పిల్లలవైపూ చూస్తోంది. జానకమ్మ క్షణం తర్వాత లేచి ఆ పిల్లల్తో కలిసి వాళ్ళని ఆడించసాగింది. ఆ ఆనందంలో ఆమె లీనమైపోయింది.

లక్ష్మణరావు కళ్ళుమూసుకుని కూని రాగాలు తీస్తున్నాడు.

రామచంద్రం బీచిలో జనాన్ని పరికిస్తున్నాడు.

రాధ ముఖం పక్కకి తిప్పుకుంది!

రంగురంగుల చీరలు వయ్యారంగా పోతున్నాయి. జంటలు జంటలుగా పోతున్నారు. నవ్వుతున్నారు. తూలుతున్నారు. పేలుతున్నారు. హుందాగా వెళ్ళేవాళ్ళు వెళ్తున్నారు. అల్లరిచేసే పిల్లలు అరుస్తున్నారు.

చీకటి పడుతోంది.

సముద్రం నల్లబడుతూంది. దీపాలు వెలగటంతో ఆ నలుపుకి మెరుపు వచ్చింది. అమేయమైన శక్తి సంపన్నుడు ఈ సముద్రుడికి చెలియలికట్ట అనే ఒక హద్దువుంది. ఈ మనిషికి మటుకు అలాంటి హద్దులు లేవు. ఏవేవో ప్రమాదాలు తెచ్చిపెడుతూనే వుంటాడు. అందుకే సముద్రం నిరంతరంగా ఘోష పెడుతూంటుంది. జారిపడుతూంటుంది. ఆవేశ పడుతుంది.

"కాలేజీలో ఎన్నికల ప్రచారం ముమ్మరంగా జరుగుతోంది. ఉభయపక్షాల వాళ్ళు చాలా పట్టుదలగా ఉన్నారు. ఎవర్ని కదిపినా ఇదే గొడవ."

"అంటే?" అన్నాడు లక్ష్మణరావు అర్థంకాక.

"కాలేజీ మొత్తంమీద నాయకుల్ని ఎన్నుకుంటారు."

"ఎందుకు?"

"హక్కుల పోరాటానికి. పరిపాలనలో విద్యార్థుల ప్రాతినిధ్యం ఉండటానికి అని వాళ్ళు చెబుతున్నారు. మొత్తంమీద శోచనీయమైన విషయం ఏమిటంటే బయట పార్టీలు ఈ ఎన్నికలలో జోక్యం చేసుకుంటున్నాయి. అక్కడి వాతావరణం చూస్తే పెద్ద ఎన్నికల్ని మించిపోయిన ఉద్రేకాలు, ఆవేశాలు, దూషణ, భూషణలు రెచ్చిపోతున్నాయి. ఆఖరికి సినిమా హాల్లో కూడా ఇదే ప్రచారం."

"ఖర్చు చాలా అవుతుందనుకుంటా"

"తలమీద అవుతుంది."

"అక్కడ నెగ్గిన ప్రతివారూ తాను M. L. A. గాను M P. గాను భావిస్తాడనుకుంటా"

"చక్రవర్తి అనుకుంటాడు."

"అయితే చదువు సంగతి"

"మట్టిలో కలిసిపోయింది. ఎవడికి కావాలి చదువు. నిలబడ్డ ఇద్దరు అభ్యర్థుల్లో

# జీవనగంగ

ఒకరు రెండోవాడ్ని కలుసుకుని రహస్యంగా "నీకు వెయ్యిరూపాయలు ఇస్తాను. ఉపసంహరించుకో. నీతరఫు వాళ్ళని కొంత మందిని నేను బలపరుస్తాను" అని అడిగాట్ట."

పడుకున్నవాడల్లా లక్ష్మణరావు లేచి కూర్చుని కళ్ళుతెరిచి ఆశ్చర్యంగా "ఆఁ! చెప్పు... చెప్పు" అన్నాడు.

"ఆ రెండోవాడి సమాధానం ఏమిటో తెలుసా "ఛా! నేను డబ్బుకి కక్కుర్తి పడేవాడ్ని కాను. నేను నా కంఠంలో ప్రాణం ఉండగా ఉపసంహరించుకునేది లేదు" అన్నాట్ట."

లక్ష్మణరావు పొట్టచెక్కలయేలా నవ్వుకుని కడుపుపట్టుకుని బలవంతాన ఆపుకుని "ఇంతనవ్వు ఈమధ్యలో ఎప్పుడూ రాలేదోయ్, కడుపులో పట్టు వచ్చింది. కానీవు అవు" అన్నాడు.

అతను పదినిమిషాలు గడిచిన తర్వాత "నే నేఅయితే ఆవెయ్యిరూపాయలూ పుచ్చుకొని మాట్లాడకుండా బుద్ధిమంతుడులా ఇంటికి వచ్చేవాడ్ని" అన్నాడు.

'అవతల అభ్యర్థికి పట్టుదల వచ్చింది. ప్రతిఓటర్ని స్వయంగా కలుసుకుని డబ్బిచ్చి ఏజంట్లని పెట్టుకుని ముమ్మరంగా ప్రచారం సాగిస్తున్నాడు. ఇవతల నిజాయితీపరుడు ప్రత్యర్థి తన్ని యాచించిన ఉదంతమంతా కరపత్రాలు వేయించి మనిషిమనిషికీ పంచి పెడుతున్నాడు. ఊళ్ళో పెద్దపెద్ద బహిరంగసభలు జరుగుతున్నాయి. విద్యార్థులు ఇంటింటికీ తిరిగి ప్రచారం చేస్తున్నారు. సినిమాకెళ్తే మీ ఓటు ఫలానా వారికి వేయ ప్రార్థన..."అక్కడకూడా ఇదేగొడవ!"

"మరి పిల్లలు సరిగా కాలేజీలకు వస్తున్నారా?"

"ప్రతిరోజూ అటెండెన్సు వేసేటప్పుడు క్లాసుల్లో ఉంటారు. తరువాత వేళల్లో ఆ చుట్టుపక్కల హోటళ్ళలోనూ, ఇందుకోసం ప్రత్యేకంగా అద్దెకుతీసుకున్న ఎన్నికల కార్యాలయాలలోనూ చేరి లెక్కలు వేసుకుంటూంటారు. వాళ్ళకి ఇంకోగొడవ లేదు."

"నిన్నెవరూ పట్టుకోలా?"

'ఇద్దరు అభ్యర్థులూ నాదగ్గరకు వచ్చారు. ఇద్దరికీ చెప్పాను నేను ఎవరికీ ఓటుచెయ్యనని. కారణం? అన్నారు. అసలు నాకు ఈ ఎన్నికలంటే ఇష్టంలేదుకనక' అని చెప్పాను. అయిద్దరూ విడివిడిగా నన్ను కలుసుకుని తనకి వెయ్యకపోతేమానె ఎదుటివాడికిమటుకు వెయ్యవద్దని ప్రాధేయపడి నా దగ్గర ప్రమాణంతీసుకుని మరీపోయారు.

చీకటి బాగాపడిపోయింది. ఆకాశం మేఘావృతమై వుంది. వాన వచ్చేటట్లుంది. ఇక లేద్దామా అన్నాడు లక్ష్మణరావు...

అంతా లేచారు.

వారు ఇంట్లో అడుగుపెట్టారో లేదో పుట్టి మునిగినట్టుగా హోరుమంటూ జడివాన కురవసాగింది.

## 15

ఆరోజు మంగళవారం. లక్ష్మమ్మగారు ఆరోజు మరీ ముందుగా లేచారు. ఆమె లేచేసరికి ఇంకా బాగా చీకటి వుంది. ఆ తర్వాత పది నిమిషాలకి తొలికోడి కూసింది. ఇంకా ఊరు నిద్రపోతూనే ఉన్నది. ఆమె లేచి పెరటి తలుపు తీసుకుని బావిదగ్గరకు వెళ్ళి ముఖం కడుక్కుని ఆ తర్వాత అనిన్ని క్రితంరోజు సాయంత్రం ఎవరికీ తెలియకుండా పనిమనిషిచేత తెప్పించిన కూరలన్నీ ఎదురుకుండా పోసుకుని తరగసాగింది. ఆమె కొంత డబ్బు కావాలని రామచంద్రాన్ని అడిగింది క్రితంరోజు. అతను దేనికి అని ప్రశ్నవేశాడు. ఆమె చెప్పకుండా 'కావాలి ఇస్తావా ఇవ్వవా' అంది. అతను తనదగ్గర లేదన్నాడు. ఆమె మరి మాట్లాడలేదు. ఒక నిశ్చయానికివచ్చి మెదలకుండా ఊరుకుని ఆమె అభిలాష ప్రకారం అన్నీ సన్నాహాలూ చేసుకుంది రహస్యంగానే. తన్ను పంపించేముందు మధుసూదనం కొంత డబ్బు తనకి ఇచ్చాడు. అందులో కొంత ఖర్చయినా కొంత ఇంకా ఆమెదగ్గర వుంది. ఆ డబ్బుపెట్టి కూరలు తెప్పించి, తాను గుడికి పోతున్నానంటూ వెళ్ళి ఒక మంచి పరికిణీ గుడ్డ, జాకెట్టు గుడ్డా కొని అప్పటికప్పుడు కుట్టుమనిషిదగ్గరకు వెళ్ళి రెట్టింపుఛార్జీ యిచ్చి కొన్ని గంటలలో అవి కుట్టించి రహస్యంగా ఎవరికీ కంటబడకుండా వాటిని తెచ్చి పెట్టెలో ఉంచింది. వంటగది తలుపు దగరగా వేసి ఆమె వంటగదిలో పనులు ఎవరికీ నిద్రాభంగం కలక్కుండా మెల్లగా చేసుకోవసాగింది.

ఆమె చెయ్యదల్చుకున్న దేదో ఇంత రహస్యంగా చెయ్యటానికి కారణం ఇది.

"అమ్మాయి రేపు మన సుజాత పుట్టినరోజు కదూ" అన్నారు లక్ష్మమ్మగారు క్రితం సాయంత్రం కూతురు జానకమ్మతో.

"అవును" అని మామూలుగా సమాధానం ఇచ్చింది జానకమ్మ.

"అదేమిటే అలా తేలిగ్గా అంటావు. కొత్త ఖరీదయిన బట్టలూ అవి కుట్టించి



ఇరుగు పొరుగు వాళ్ళని భోజనానికి పిల్చుకుని కొత్త ఘనంగా ముచ్చట చేసుకో వద్దూ." అన్నారు లక్ష్మమ్మగారు మందలించే ధోరణిలో.

జానకమ్మ తల్లిని జాలిగా ఈ మాటలు శ్రద్ధ విన్నా లేనా అని సందేహపూర్వకంగా పరికించి "పుట్టినరోజు పండగ చేస్తూ చేస్తాను. కాని మీరనుకున్న పద్ధతిలో జరగదు." అంది.

లక్ష్మమ్మగారికి తెలిసిన పద్ధతల్లా ఒకటే. ఆ యింట్లో పద్ధతేదీ అదేనని తోచడం లేదు. ప్రశ్నార్థకంగా ఆమె కూతురు ముఖం లోకి చూసింది.

"ఆరోజు ఒక పేదవానికి భోజనం పెట్టి ఒక రూపాయి అతనికి దానం ఇస్తారు. అందువల్ల మనసుకి ఒక మంచిపని చేశామనే తృప్తి కలుగుతుంది. అది సంజీవిలాంటి అనుభూతి అని అంటారు ఆయన" అంది జానకమ్మ.

"ఎడిపినట్టే వుంది మీ పద్ధతి. లోకం అంతా ఒక దారిని పోతే మీరు మరో దారి వెదుకుతూంటారు. చూస్తున్నాగా మీ ధోరణి. నాకేం నచ్చటం లేదమ్మాయ్. ఇదేం బాగులేదు. పుట్టినరోజు పండగ చేసుకోకపోవటమేమిటి ఖర్మ. పైగా ముష్టివాడికి అన్నం పెడతారట ఇదో గొప్పవిషయంవిటో!" అంటూ నీరసంగా తల్లి మాట్లాడుతూంటే జానకమ్మ "పోనీలే అమ్మా నీకు కష్టంగా ఉంటుంది. ఈ ఇంట ఇలాంటి మాటలు పనికిరావు, ఆయన వింటే కోపగించుకొంటారు." అంది జానకమ్మ.

అంతటితో లక్ష్మమ్మగారు ఊరుకోలేదు. కోపంగా అల్లుడిదగ్గర ఈ విషయం కదిపింది.

"అబ్బాయ్ నా ఒక మాట అడుగుతాను చెప్పు" అంది.

పేపరు ముఖంమీంచి తప్పించి "ఏమిటది?" అన్నారు లక్ష్మణరావు.

"రేపు కుమారి పుట్టినరోజు. కొత్త ఖరీదయిన బట్టలు కుట్టించి ఇరుగుపొరుగువాళ్ళని పదిమందినీ పిల్చుకుని ముచ్చట జరిపించటానికి నీవు అడ్డుపడతావటగా. దేనికి?" అన్నారు లక్ష్మమ్మగారు.

"అసలు ఆపద్ధతిలో పుట్టినరోజులు జరపాలని ఒకరు కోరితే కదా నా అభ్యంతరం మాట వచ్చేది" అన్నారు లక్ష్మణరావు.

"ఎవరూ ఇంతవరకూ అడగలేదే అనుకో! నీకన్నా ఎందుకు తోచలేదూ?"

"నాకు అలాంటి విషయాలు తోచవు."

"జరిగించాలనుకుంది దేనికిగాని చెపితే సంగతి చెప్పు. ఇప్పుడు నేను అడుగుతున్నాగా."

"పుట్టినరోజు చేస్తాను. దాని ప్రాముఖ్యత నాకు తెలుసు. కాని మీరనుకునే పద్ధతిలో అది జరగదు."

"అదీ విన్నాను. అదేం బాగుంటుంది. పోనీ అలాగూ చెయ్యి. కాని నా పద్ధతి కూడా అనుసరిస్తే బాగుంటుంది. పదిమందిని పిలుచుకుని..."

ఆమె పూర్తిగా చెప్పకుండానే అతను నవ్వుతూ "అలాంటిపద్ధతులు నాకు నచ్చవు" అని తిరిగి అతను పేపరు చదువుకోసాగాడు.

"అదే. ఎందుకని అడుగుతున్నాను" అంటూ రెట్టించారు లక్ష్మమ్మగారు.

కొంత వరకూ అర్థం చేసుకుని" ఇదంతా ఏమిటి అమ్మా?" అని రెండోసారి ప్రశ్నించింది.

"అదంతా తర్వాత చెబుతాను గాని ముందు సుజాతని లేపి ముఖం కడిగి తీసుకుంటు ప్రయత్నించూడు. ఆ మీద నూనె వేసి జన్ను పిలు. నేను వచ్చి ఆశీర్వదిస్తాను. తొందరగా తెముల్చు. ఈలోపున రామమ్మ వదినందినీ పిలుచుకువస్తుంది. నువ్వు తొందరగా తెములు" అని లక్ష్మమ్మగారు వంట ప్రయత్నాలలో మునిగి పోయారు.

ఈ సమయంలో ఏవి మాట్లాడాలో జానకమ్మకి తోచపడలేదు. ఇక ఇంతవరకూ వచ్చింతర్వాత ఆమెకి చెప్పికూడా ప్రయోజనం లేదు. లక్ష్మణరావు లేచి ఇంతా చూసి ఏమి కేకలు వేసారో అని ఆమె భయపడసాగింది ఇలాంటివి ఆయనకి పనికిరావని తనకు తెలుసు. తను ఆ విషయం చెప్పిందికూడాను.

జానకమ్మ ఇక అక్కడ నిలబడకుండా అవతలికి వెళ్ళిపోయింది. ఆ తర్వాత ఒకరికి తర్వాత ఒకరు లేచి లక్ష్మమ్మగారి ఈ సాహసానికి ఆశ్చర్యపడటమే కాకుండా ఇది ఎటువంటి పరిణామాలకి దారితీస్తుందో అని కూడా భయపడ్డారు. రామమ్మ ఆ విషయం అంగీకరించింది కూడాను.

"ఇదేమైనా బాగుందా అమ్మా. వాడికి తెలియరాదూ?" అని.

"అవంతా వాడు తెలుసుకుని నువ్వు ముందు ముఖం కడుక్కో. చెబుతాను." అన్నారు లక్ష్మమ్మగారు. ఆవిడపనిలో నిండా మునిగిపోయున్నారు. ఒళ్ళంతా ముచ్చెమటలు పోశాయి. తడిబట్టతో తుడుచుకుంటూ పనిచెయ్య సాగారు.

లక్ష్మణరావు వీళ్ళందరికంటె ముందు లేచినా అతనికి పక్క వాటాలో జరుగుతున్న ఈ తతంగం తెలిసే అవకాశం లేకపోయింది.

లక్ష్మమ్మగారు జానకమ్మని పిల్లకి తలంటి నీళ్ళుపొయ్యమని మరోమారు హెచ్చరించారు.

జానకమ్మ వచ్చి "పిల్లదాని వొళ్ళు కొద్దిగా వెచ్చగా ఉన్నదే" అంది.

లక్ష్మమ్మగారు వెంటనే వెళ్ళి పరీక్షించే వారేగాని మడిలో ఉండి పోయారు.

"బాగా వేడిగా ఉందా?"

"అంత ఎక్కువగా లేదు."

"అయితే ఫర్వాలేదు. పోనియ్యి అయినా పుట్టినరోజు పూటా తలంటు పొయ్యకుండా ఎలాగూ తప్పదు. నువ్వు సంకోచించక."

అటూ ఇటూ తోచని జానకమ్మ ఇరకాటంలో పడింది.

ఎండ ఎర్రగా పాకిపోతూంది.

లక్ష్మణరావు లోపలికి వెళ్ళి సుజాత ఒంటి మీద చెయ్యి వేసి లేపబోయాడు. వొళ్ళు వెచ్చగా చేతికి తగిలింది. భార్యని పిలిచాడు. జానకమ్మ ఆదుర్దాగానే లోపలికి వచ్చింది.

"పాపకి జ్వరం వచ్చినట్టుంది. ఇవాళ తలంటు పొయ్యకు. మిగతా దంతా యథావిధిగా జరుపుదాం. మన పద్ధతి ఉందిగా" అన్నాడు లక్ష్మణరావు.

"కాని అమ్మ..."

"వాళ్ళతోనూ చెప్పింది. నేను ఒప్పుకోలేదు"

"ఆవిడ మానలేదు. అప్పుడే ఆవిడ చాలావరకూ పనుపూర్తి చేసింది" అంది జానకమ్మ ధైర్యం చేసి.

లక్ష్మణరావు సమాధానం చెప్పకుండా గభుక్కున అవతలివాటాలోకి వెళ్ళి వంట

అని పిలిచారు.

జానకమ్మ వచ్చి 'ఏమిటమ్మా' అంది.

"అది వినటంలేదు. పోయి నువ్వన్నా ముత్తయిదువుల్ని ఈపూట భోజనానికి సాయంత్రం పేరంటానికి కొత్త పిలుచుకురా అమ్మా."

జానకమ్మ నవ్వుతూ "ఇదంతా ఏమిటమ్మా. ఆయన కిలాంటివి ఇష్టం ఉండవని నీకు తెలుసు. ఆయన ఇష్టాలకి వ్యతిరేకంగా నేను ఈ పని చేస్తే నా పరిస్థితి ఏమిటో నువ్వు ఆలోచించటంలేదు. అన్నం ముట్టుకుండా మునపటిలాగే వెళ్ళిపోయేటట్టు వుండు. ఇరుగుపొరుగువాళ్ళని భోజనానికైనా, పేరంటానికైనా పిలవటం కుదరదు. అది జరిగేపనికాదు. నేను వెళ్ళి వాళ్ళని పిలవటం జరగదు." అంది.

లక్ష్మమ్మగారు నిశ్చేష్టులై ఈ సహాయనిరాకరణోద్యమం ఎంతబలముగా వుందో గ్రహించినదై ఇప్పుడేమిటి కర్తవ్యం? అన్న ఆలోచనలో పడిపోయారు.

ఆమె నేరుగా లక్ష్మణరావు దగ్గరకే వెళ్ళి "ఇదేమైనా బాగుందా నాయనా. పిల్లల్ని నీవైపు తిప్పుకుని నన్ను యిబ్బంది పెడతావా? ఇప్పుడింత తతంగం చేసుకుంటే వెళ్ళి ఇరుగుపొరుగువాళ్ళని ఒకపూటభోజనానికి పిలవమంటే దానికింత పంతమా. పనేమీ వెళ్ళొద్దని నామాట ఈ కూతుళ్ళిద్దరూ ధిక్కరించటం ఏమైనా సబబేనా? నువ్వు చెప్పు" అన్నారు.

"నేనేమీ వాళ్ళని వెళ్ళవద్దని చెప్పలేదు. అయితే ఇలాంటి పద్ధతులు మనకు నాకు ఇష్టం వుండదు. నా పిల్లలకే కాదు. ఈ ఆవరణలో ఎవరికీ ఇలాంటివి పనికిరావు. అలా అని మీతో నిన్న స్పష్టంగా చెప్పాను. అయినా మీరు లక్ష్యపెట్టకుండా మీ ప్రయత్నాలు మీరు చేశారు. పంతగిస్తున్నది ఎవరో తెలుస్తూనే ఉంది. నా కూతురు పుట్టినరోజు ఎలా జరగాలో అలాగే జరుగుతుంది. అందుకు భిన్నంగా జరగటానికి వీల్లేదు. జరగనివ్వను. ఎవరు ఏమయినా అనుకోండి. నేను లక్ష్యం చేసేది లేదు. బహుశ మీరు నేను పిసినారిని కావటంవల్ల పుట్టిన రోజు పండుగ ఘనంగా చెయ్యటం లేదని అనుకుని వుంటారు. అందుకని మీ డబ్బుతో చేస్తే నాకేమి అభ్యంతరం ఉండవలసిన అవసరం లేదనికూడా అనుకుని వుంటారు. మీరు చాలా పొరబడ్డారు."

లక్ష్మమ్మగారు నివ్వెరపోయి కొంతసేపయింతర్వాత కష్టపడిన మనస్సుతో, అవమానంతో అక్కడ్నుంచి వెళ్ళిపోయారు. ఈ ఆత్మీయులంతా ఆఖరికి కన్నపిల్లల దగ్గర్నుంచి తనమీద ఎందుకు కక్ష కట్టారో ఆమెకి అర్థంకాలేదు. తనకోసమని ఆమె ఏమీ కోరటం లేదు. ఆమె ఏమి చేసినా ఈ పిల్లలకోసమే చేస్తూంది. మూడు నాలుగు మంచి పండగలు కాను వస్తుంటే తనకి సంవత్సరం వెళ్ళిపోతుంది. ఒకపూట తిండితో రోజు వెళ్ళిపోతుంది. పెద్దది కాబట్టి పిల్లలకే అవి ఇవి చెయ్యాలని ఉబలాటం పడుతుంది. ఈ స్వార్థరహితమైన ఆమె అభిలాషని వీరంతా ఎందుకు ప్రతిఘటిస్తున్నారో తనకి అర్థం కావటం లేదు.

ఆమె ఏమి చెయ్యాలో పాలుపోక వంటగది గుమ్మానికి చారబడి కూచుని ఆలోచిస్తూ ఉండిపోయారు.

లక్ష్మణరావు లోపలికి వచ్చి వెనక నిలబడ్డాం ఆమె గమనించలేదు. ఆమె కళ్ళు వత్తుకుంటుంటే "మీరు బాధపడకండి. పోనీ మనం అంతా కలిసి భోజనం చేద్దాం. పదార్థాలు మిగిలిపోతే రాత్రికూడా అవే ఉపయోగించుకుందాం. ఇంకా మిగిలేట్టుగా వుంటే బిచ్చగాళ్ళకు పంచి పెడదాం" అన్నాడు లక్ష్మణరావు సానునయస్వరంతో.

"వీల్లేదు. నే అనుకున్నట్టుగా జరగవలసిందే జరగాలి. లేదా ఇదంతా తీసుకెళ్ళి మురుగు కాలవలో పోసేస్తాను. ముష్టివాడికి ఒక్క ముక్క వెయ్యటానికి వీల్లేదు" అంటూ లేచిపోయారు లక్ష్మమ్మగారు. అసలే ఉదయంనించి ఆమె మంటకి కందిఉండటమో ఈమాట లనేప్పుడు ఆమె కళ్ళు చింతనిప్పుల్లా భగ్గుమని మండిపోయాయి. ఆమె స్వరం చాలా కఠినంగానూ, తీవ్రంగానూ కూడా ధ్వనించింది. కోపంతీవ్రతతో కంపిస్తూన్న శరీరంతో ఆమె అతని ఎదటనించి అవతలికి వెళ్ళిపోయింది.

లక్ష్మణరావు నిట్టూర్చి ఇవతలికి వస్తూ "ఈమె సామాన్యురాలు కాదు" అని మనసులో అనుకున్నాడు.

బయట పిల్లలు చదువుకుంటున్నారు. మల్లిబాబు లక్ష్మణరావు ముఖంలోని తీవ్రతని గమనించి మాట్లాడకుండా వరండాలో ఆపిన పాఠాన్ని కొనసాగించాడు.

తల్లి ధోరణికి బాగా అలవాటు పడిన రాణి ఆ ఛాయలకే రాకుండా దూరదూరంగా తిరుగుతోంది.

లక్ష్మమ్మగారు అన్నంతపని చేశారు. ఆమె ఉద్రేకంలో ఆ చేసిన వంటకాలన్నీ పట్టుకుపోయి వీధిలో మురుగు కాలవలో పారబోసి లోపలికి వచ్చి "ఇప్పుడు మీ అందరికీ చల్లగా ఉన్నాయా? పోయి చూసిరండి. వెళ్ళండి. వెళ్ళరేం?" అంటూ అరిచి పెద్దగా ఏడుస్తూ గోడకి చారబడి పోయారు.

(ఇంకా వుంది)

---

**చుక్కల రేడా!**

చుక్కల రేడా! రావోయీ
మా
చక్కని పాప పిలిచె నోయీ!
మబ్బు తెరలలో దాగకుమా,
మా
అబ్బాయికి నీ వంటి సరదా ॥చు॥
"మామా!" అని మా చిట్టి పిలిచితే
ఏమోయీ మఱి మాటు పలుకవే
॥చు॥
చిన్ని పాప చిరునవ్వు చూడు నీ
కన్నుల సోయగ మెంతో చూతము
॥చు॥
చుక్కలలో నీ చక్కదనములూ నీ
చక్కెరంత లిక చాలు చాలులే
॥చు॥
ముచ్చటైన నీ మోములోని ఆ
మచ్చను చిట్టి తుడిచేస్తాడట ॥చు॥
చుక్కలరేడా! రావోయీ
చక్కని పాప పిలిచె నోయీ!

సముద్రాల లక్ష్మణయ్య.

---

డాక్టరు: ఇంట్లో రాత్రిపూట ఫోను మోగింది. ఒకరోగి "డాక్టరుగారూ! నాకు నిద్రపట్టడం లేదండీ," అన్నాడు.

డాక్టరు: ఆగండి. జోల పాడుతాను.

# ఇద్దరు * రెండు



కొంపెల్ల శివసుబ్రహ్మణ్యం

వాళ్ళిద్దరమ్మాయిలు. ఇద్దరికీ చెరో రెండేసి జడలు. వేషభాషల్లోనూ, కట్టుబొట్లలోనూ ఒకరి నొకరు యథామాత్రంగా అనుకరిస్తుంటారు. ఒకరిని విడిచి మరొకరు ఉండలేరు. ఒకే క్లాసు, ఒకే డివిజన్లో, ఒకే బెంచీమీద ఇద్దరూ కూర్చునివుంటారు. కలిసి క్లాసులకొస్తారు. తిరిగి కలిసే వెళతారు. ఒకరంటే మరొకరికి అపరిమితమైన అభిమానం. ఒక అమ్మాయికి ఎక్కడైనా, ఎప్పుడైనా, ఏదైనా ఇన్సల్ట్ గాని, ఇక్కట్టు గాని సంభవించిదే, అకస్మాత్తుగా, అమాంతంగా మరో అమ్మాయి తన సఖి విరోధిమీద విరుచుకుని పడిపోతుంది. అంత గాఢమైత్రి వాళ్ళిద్దరిమధ్యా అల్లుకుంది.

అంతే! ఇద్దరిమధ్యా ఏదో చిన్న తగాదా వచ్చిపడింది! మాటలాడుకోవడం మానేశారు. నువ్వెంతంటే నువ్వెంత అనుకున్నారు.

గర్ల్స్ హైస్కూలులో అందరికీ వీరిద్దరి వియోగం ఆశ్చర్యం కలిగించింది. ఇప్పుడు ఇద్దరూ కలిసిరారు. కలిసి వెళ్ళరు. ఒకరంటే మరొకరికి పడదు. ఏ ఒక్కరికైనా ఇన్సల్ట్ గాని ఇక్కట్టు గాని తటస్థిస్తే మరో అమ్మాయి పిలవని పేరంటమైనా విరోధిదగ్గరకు వెళ్ళి తగినంత ప్రోత్సాహాన్ని కలిగిస్తూ ఉంటుంది. ఒకరిని మరొక రెవరైనా అవమానపరిస్తే ఇంకో అమ్మాయి పరమానందం పొందుతుంది. ఆ అమ్మాయినిగురించి ఈ అమ్మాయి, ఈ అమ్మాయినిగూర్చి ఆ అమ్మాయి తెగ ఆడిపోసుకోవడం పరిపాటయింది.

మొదటి రెండు జడ లమ్మాయి పేరు స్వాహాదేవి. బ్రాహ్మణకులంలో... అందులోనూ నియోగికుటుంబంలో పుట్టింది. సుమారు పదెనిమిది సంవత్సరా లుంటాయి. ముద్దుగా ముద్దొస్తున్నట్లు మురిపించే రెండు సన్నని జడలు. ఆ జంటజడల కొసలకు కొంచెం పైగా రంగురిబ్బనులు. వయస్సుకు తగిన అవయవనిర్మాణం. కొద్దిగా కోలగలిగిన ముక్కు. చిలిపికళ్లు కాకపోయినా మొత్తానికి సీరియస్ గా చూసే నయనాలు. దొండపండుకు దూపికేట్లా పెదవులు, ఎడమ చేతికి వాచీ. కంఠం కంచులా మోగుతుంది.

వంకలుతిరిగిన శిరోజాలు. ముఖంమీద అక్కడక్కడ పొక్కుటకం మచ్చలు (అదైనా [illegible]). సుమారు అయిదడుగుల పొడవుంటుంది.

ఇక రెండవ రెండుజడ లమ్మాయి పేరు లీలాజ్యోతి... సుమారు ఇరవై సంవత్సరా లుంటాయి. కొద్దిగా స్థూలకాయమనే అనొచ్చు! వేషభాషలలోనూ, ఆంగికాకారాలలోనూ మొదటి రెండుజడ లమ్మాయిని ఇమిటేట్ చేస్తుంది. మొదటి రెండుజడ లమ్మాయి జడలకూ, రెండవ రెండుజడలమ్మాయి జడలకూ వ్యత్యాసం కనిపిస్తుంది. జడ కొసలదగ్గర కాక మధ్యలో రిబ్బను ఉంచుకుంది. రిబ్బను క్రిందిజడ కుచ్చుగా వదిలేస్తుంది. శిరోజాలు వంకడంకోసం ప్రయత్నాలు చేస్తూ ఉంటుంది. కుడిచేతికి వాచ్.

అసలు ఇద్దరిమధ్యా ఏంగొడవలొచ్చాయో ఏ మాటపట్టింపులొచ్చాయో ఎవరికీ తెలీదు. పట్నంలో ఇంత ప్రఖ్యాతిగాంచిన జంట విడిపోయిందని తెలియగానే విద్యార్థి(నీ) లోకం తల్లడిల్లిపోయింది. ఉపాధ్యాయ(నీ) బృందం చాలా విచారించింది. ఎవరివల్ల, ఎందుకోసం వీళ్ళిద్దరికి విరోధం ప్రాప్తమయిందో వాళ్లలో ఏఒక్కరూ చెప్పటంలేదు. స్వాహాదేవి లేనపుడు లీలాజ్యోతి, లీలాజ్యోతి లేనపుడు స్వాహాదేవి తమతమ స్నేహితురాళ్ళతో తన తప్పేం లేనట్లు, ఎదుటి అమ్మాయిదే తప్పని వాదించడం మామూలైంది. అటాగా అని విద్యార్థినీ సోదరీమణులు గంగిరెద్దుల్లా తలలూపేవారు. "నిజానికి తమ స్నేహం చిరకాలం నిలవలసినదేనని. కాని ఆ అమ్మాయి (ఒకరినొకరు) ఆ గౌరవం వుంచుకోలేదని, ఆ అమ్మాయి వంశమే అపలింతనీ, ఆ వంశం అటు ఏడు తరాలు ఇటు ఏడు తరాలు నాశనమై పోతాయని... ఇంకా ఏవేవో ఎన్నో చెప్పి... చివరమాటగా తాను చాలా మర్యాదస్తురాలినని తెల్పి... ప్రత్యేకంగా పనిగట్టుకుని వెళ్ళి మరీ చెప్పి వస్తున్నారు ఇద్దరు రెండు జడలమ్మాయిలూను.

# జడల అమ్మాయిలు

ఇలా ఒకమ్మాయిమీద మరో అమ్మాయి కయ్యానికి కాలుదువ్వుతున్న శుభముహూర్తంలో హెడ్‌మిస్ట్రెస్ పిక్‌నిక్ పార్టీ ఏర్పాటు చేసింది. దానికి నాయకురాలిగా లీలాజ్యోతిని నియమించింది ఆవిడ. ఇది స్వాహాదేవి కంట్లో కారం కొట్టినట్లయింది. రెండవ రెండు జడలమ్మాయిని నాయకురాలిని చేయడం మొదటి రెండు జడలమ్మాయికి కళ్ళల్లో నలుసులు గుచ్చినట్లయింది. తనను కాదని హెడ్‌మిస్ట్రెస్ లీలాజ్యోతిని లీడర్‌గా నియమించడంలో ఏదో నిగూఢరహస్యం దాగివుందని తన చెలికత్తెలందరికీ బొట్టుపెట్టి మరీ చెప్పవచ్చింది ఈ దారుణావమానాన్ని మొదటి రెండు జడలమ్మాయి భరించలేక తాను పిక్‌నిక్ పార్టీకి రాలేననేసింది.

లాభంలేదు! రాక తప్పదన్నారు పార్టీ సభ్యురాండ్రు. తానిప్పుడు పిక్‌నిక్ పార్టీకి రాకపోతే వచ్చే నెలలో స్కూల్ ప్యూపిల్ లీడర్ ఎన్నికలలో గెలవటం అసంభవం అని హెచ్చరించారు పార్టీ పెద్దలు. ఏమైనాసరే తాను వెళ్ళి తన సమర్థత, శక్తి, ఎదుటి విరోధి అసమర్థత, అశక్తి నిరూపించి తీరాలని నిశ్చయం చేసింది మొదటి రెండు జడలమ్మాయి ఎసెంబ్లీ సభ్యురాండ్ర సంఘం.

ఆదివారం ఉదయమే ఏడవకుండా (7 గం॥ కాకుండా) స్కూలు కాంపౌండులో సమావేశమయ్యారు విద్యార్థినీసమాజమంతా. ఇంతలో హెడ్‌మిస్ట్రెస్ శ్రీమతి కోదండం దర్జాగాను రిక్షామీద నెమ్మదిగా దిగింది. విద్యార్థినీ బృందం రెండు పార్టీల సభ్యురాళ్ళు విడివిడిగా ఆమె కెదురేగి స్వాగతమిచ్చారు.

"జ్యోతీ! పిల్లలూ, ఇతర సరుకులూ సిద్ధంగా వున్నాయా!" అంది హెడ్‌మిస్ట్రెస్ తన స్థూలకాయాన్ని సవరించుకుంటూ.

"ఉన్నాయి మేడమ్! అన్నీ తెచ్చాం!" అంది లీలాజ్యోతి అనే రెండుజడలమ్మాయి.

"సరే! ముందు వాళ్ళని ఫాలిన్ చేసి అటెండెన్సు తీసుకుని రా! నేను మేడమీద వుంటాను!" అని ఆజ్ఞలు జారీచేసి హెడ్‌మిస్ట్రెస్ ఫాన్సు చేత్తో పుచ్చుకుని వెళ్ళిపోయింది.

రెండవ రెండు జడలమ్మాయి కళ్ళు గర్వంతో మెరిసేయి. మొదటి రెండు జడలమ్మాయి వైపు 'ఆఫ్టర్ ఆల్ నీవెంత! చూడు నా గొప్పదనం! అన్నట్లు చూసింది. మొదటి రెండు జడలమ్మాయి ఒంటిమీద జెర్రులూ, తేళ్ళూ పాకినట్లయింది.

"కమాన్ ఫాలిన్!" అని అరిచింది రెండవ రెండు జడలమ్మాయి.

మొదటి రెండుజడలమ్మాయి పార్టీ కదలకుండా తమధోరణిలో తామున్నారు.

రెండవ రెండుజడలమ్మాయి పార్టీ ఎంతో వినయంగా, విధేయపూర్వకంగా తమలీడర్ ఆజ్ఞ పాలించి గౌరవించేరు.

"పార్టీ... ఫాలిన్!" అని తిరిగి ఆజ్ఞాపించింది రెండవ రెండుజడలమ్మాయి.

మొదటి రెండుజడలమ్మాయి స్కూలు మేడవైపు దృష్టి సారించింది.

హెడ్‌మిస్ట్రెస్ మేడవరండాలో నిలుచుండి తమవైపు చూస్తోంది.

"రండర్రా!" అని లేచి నిలబడింది మొదటి రెండు జడలమ్మాయి.

ఆమె పార్టీ లేచి నిలుచుంది.

ఏమయితేనేం మొదటి రెండు జడలమ్మాయి పార్టీ, రెండవ రెండు జడలమ్మాయి పార్టీ ప్రక్కగా నిలబోక తప్పలేదు.

"పార్టీ ఎటెన్షన్!" అంది తాను ఆ పొజిషన్‌లోకి వస్తూ లీడర్.

పార్టీ అంతా... కొంతమందికి ఇష్టంలేకపోయినా... హెడ్‌మిస్ట్రెస్‌తో మాటలు పడాలని ఆజ్ఞ శిరసావహించక తప్పలేదు.

"గివ్ యువర్ అటెండెన్స్! సుభాషిణీ తాయి...!"

"యస్ మేడమ్"

"లక్ష్మీకుమారి చినగంధం...!"

"హియర్ మేడమ్"

"స్వాహాదేవి బొడ్డపాటి...!" అంది రెండవ రెండు జడలమ్మాయి వెటకారంగా మూతితిప్పుకుని అటెండెన్సు తీసుకుంటూ.

మొదటి రెండుజడలమ్మాయి కంఠం కందగడ్డలా తయారయింది. ఆవేశం అవధులు దాటింది. కోపంతో కళ్ళు ఎర్రబడ్డాయి. తనపార్టీవైపు పరితాపంగా చూసింది. పాపం! తనపార్టీ సభ్యురాళ్ళందరూ తమ లీడర్ నిస్సహాయస్థితికి సానుభూతి చూపు చూస్తున్నారు.

"స్వాహాదేవి... బొడ్డపాటి! అంది తిరిగి వెళాకోళంగా కోరగా చూస్తూ లీడర్.

"ప్రజెంటు!" అని ముక్తసరిగా నిర్లక్ష్యంగా జవాబిచ్చింది మొదటి రెండుజడలమ్మాయి.

అమ్మయ్య! ఆదేశసుఖం అనుకుంది రెండవ రెండు జడలమ్మాయి తన లీడర్ అధికారం చెలాయించడానికి...



# ఇద్దరు రెండుజడల అమ్మాయిలు

అటెండెన్సు పేర్లు పిలవడం అకస్మాత్తుగా ఆగిపోయింది.

"ప్యాహో! ఫాలౌట్!" అంది అక్కసుగా రెండవ రెండు జడలమ్మాయి.

"అనవసరం!" అంది లైనులోనే వుండి మొదటి రెండుజడలమ్మాయి.

"ఏం! అందరూ 'ప్రజంట్ మేడమ్!' అని అంటూంటే నువ్వు 'ప్రజంట్' అని పొడి అక్షరాలు పలుకుతావేం?" అంది లీడరు తాను లీడరు అని గుర్తుచేస్తూ.

"నువ్వేం మా టీచరువి కాదు నీకు గౌరవమివ్వడానికి!" తకిమని జవాబిచ్చింది మొదటి రెండు జడలమ్మాయి.

"అటెండెన్సు తీసుకొనే ప్రతిలీడర్‌కూ గౌరవం ఇవ్వాలని తెలీదూ?"

"ఆ అటెండెన్సు తీసుకొనే లీడర్‌కి గౌరవం అంటూ ఏకోశానైనా వుంటే అలాగే ఇవ్వొచ్చు!" అంది రూల్సు తనకి కూడా తెలుసునన్నట్లుగా మొదటి రెండు జడలమ్మాయి. ఈ జవాబు తమ లీడర్ ధైర్యంగా ఇచ్చినందుకు అభినందిస్తూ, ఎదుట శత్రువుకు కలిగిన అవమానానికి వెటకారంగా పగలబడినవ్వింది మొదటి రెండు జడలమ్మాయిపార్టీ.

దానితో రెండవ రెండుజడలమ్మాయి ఆత్మాభిమానం దెబ్బతిని, తలకొట్టేసినంతపనయింది. వెంటనే హెడ్ మిస్ట్రెస్ దగ్గరకు బయలుదేరింది. విద్యార్థినీబృందమంతా ఆశ్చర్యంగా తమలీడర్ల ప్రశ్నలూ, జవాబులూ వింటున్నారు.

అయిదు నిమిషాలు నిశ్శబ్దం......

రెండవ రెండుజడలమ్మాయి తిన్నగా వెళ్లి హెడ్ మిస్ట్రెస్‌ని కలుసుకుంది. కళ్ళలో గిర్రున తిరుగుతున్న దుఃఖాశ్రువులను రుమాలుకు బలిచేసి...

"నన్ను ఇన్‌సల్ట్ చేస్తున్నారు మేడమ్!" అంది. బాధతో రెండవ రెండుజడలమ్మాయి.

"ఆ! ఎవరూ! ఇలా రమ్మను!" అంది సీరియస్‌గా ఫ్లాస్కు మూతతీసి కాఫీని డిష్‌లో పోసుకుంటూ హెడ్ మిస్ట్రెస్ శ్రీమతి కోదండమ్మ...

"ప్యాహో మేడమ్! రమ్మంటే రానంది!"

"ఆ! అలాగా! పద నేవస్తున్నా!" అంటూ డిష్‌లో కాఫీ రెండు గుటకల్లో ఖాళీచేసి రెండవ రెండుజడలమ్మాయితో విద్యార్థినీబృందం దగ్గరకు బయలుదేరింది. శ్రీమతి కోదండమ్మ.

మొదటిరెండు జడలమ్మాయి పార్టీ గజగజలాడి పోతోంది ఏం జరుగుతుందో తమ నాయకురాలి కనిపాపం..

రెండవ రెండు జడలమ్మాయి పార్టీ... తమలీడర్ హెడ్ మిస్ట్రెస్‌ని తీసుకువస్తున్నందుకు ఎగిరి గంతులు వేస్తోంది.

"ఎయ్ ప్యాహో! ఎందుకు అలా మీ లీడర్‌ని ఇన్‌సల్ట్ చేస్తున్నావట"! అంది స్కూలు కాంపౌండులోని విద్యార్థినీ బృందం దగ్గరగావచ్చి హెడ్ మిస్ట్రెస్.

"అమ్మగారూ"! అంది కంఠంలోని వణుకు కనచుకుంటూ మొదటి రెండు జడలమ్మాయి హెడ్ మిస్ట్రెస్ ప్రశ్నార్థకంగా చూసింది.

"లీడర్‌ని గౌరవించాలని తెలుసండీ" నా తప్పేంలేదు మేడమ్! నాపేరు పిలుస్తూన్నప్పుడు వెటకారంగా మూతితిప్పుతుంది మా లీడరు మేడమ్! కావలసివస్తే సుశీలను, గీతను అడగండి"! అంది మొదటి రెండు జడలమ్మాయి.

"సిల్లీ ఫెలోస్!" అని కొంచెం ఆగి తమాయించుకుంది హెడ్ మిస్ట్రెస్ శ్రీమతి కోదండమ్మ.

మొత్తానికి బృందం బయలుదేరింది. తిన్నగా గంటన్నర నడిచి ధవళేశ్వరం ఆనకట్ట చేరారు. ఆనకట్ట ప్రక్కగా వున్న గార్డెన్‌లోకి దారితీసింది హెడ్ మిస్ట్రెస్. ఆమె అడుగుజాడల్లో విద్యార్థినీమణులు గార్డెన్ ప్రవేశించారు.

హెడ్ మిస్ట్రెస్ శ్రీమతి కోదండమ్మ విద్యార్థినీ ముఠాల్ని వేరువేరు శాఖలకు మంత్రిత్వ ప్రమాణం చేయించింది.

"ప్యాహో! నువ్వూ, గీతా. లక్ష్మీకుమారి వెళ్ళి వంటవిషయం చూడండి! మీకు కావలసిన పాత్రసామగ్రిని తీసుకోండి! అప్పుడే తొమ్మిదయింది! గంటన్నరలో వంట పూర్తి చేయాలి! సేమియాపాయసం ఒకటీ పిండివంట! అదిచాలు! మధ్యాహ్నం టిఫిన్ మరొకటి చేసుకోవచ్చు! మీరువెళ్ళి మీ పనులు చూసుకోండి!

"అలాగే మేడమ్"! శిరసావహించింది మొదటి రెండు జడలమ్మాయి.

"చూడు సుశీలా! నువ్వూ శారదావెళ్ళి దగ్గరలోని ఎవరింట్లోనుండైనా రెండు పెద్ద చాప్పలు కాని, బిందెలు కాని అడిగిపట్టాలి! తిరిగి మధ్యాహ్నం ఇచ్చేద్దాం! వెళ్ళి అడగండి!" అంది హెడ్ మిస్ట్రెస్.

సుశీలా, శారదా తోటదాటి బయలుదేరారు బిందాన్వేషణకోసం.

"సుభాషిణీ! నువ్వూ, రంగమణీ ఇద్దరూ బిందెలురాగానే నీళ్లు తెచ్చి ప్యాహోకు అందించండి! జాగ్రత్త! చూసుకుని మరీ దిగండి!"

"అలాగేనండి"! తలలాడించేరు సుభాషిణీ, రంగనాయకులు.

"మీ కత్తా నా కెందుకూ? తోటలో కూర్చుని ఆడుకోండి! కేరమ్స్ రెండు బోర్డులు తెచ్చాం! గొనలు పెట్టుకోక ఆడుకోండి! పేకాటకూడా ఆడేవచ్చుంటే ఆడుకోండి! వెళ్ళండి! అని హెడ్ మిస్ట్రెస్ విద్యార్థినులను వేర్వేరు పనులకు కేటాయించి తానువెళ్ళి తనకోసం ప్రత్యేకంగా నిర్మించిన గుడ్డ గుడారం చేరింది. ఆవిడకు సమీపంలో రెండవ రెండు జడలమ్మాయి వినయంగా చేతులు కట్టుకుని నిలబడింది.

'జ్యోతీ! ప్లేయింగ్ కార్డ్సు ఆడటం నీకువచ్చు"!

"వచ్చు మేడమ్! ఆడదామంటారా"!

"నా హేండ్ బేగ్ లో వున్నాయి. పట్రా! కాసేపు ఆడదాం"!

రెండవ రెండు జడలమ్మాయి పేక తెచ్చింది. కాసేపు ...... అంటే సుమారు రెండు గంటలు ఇద్దరూ పేకాడేరు.

"మూడు జ్యోతీ! పదకొండయింది! వంటప్రయత్నం ఎంతవరకూ వచ్చాయో చూసిరా"! అంది హెడ్ మిస్ట్రెస్ పేక ముక్కలు బాక్సులో పెడుతూ.

రెండవ రెండు జడలమ్మాయి విద్యార్థినీ సమాజ కార్యక్రమాన్ని తనిఖీ చేయడానికి బయలుదేరింది. ముందు వంటెంతవరకూ వచ్చిందో ఏమో!

ఎలాగైతేనేం వంటలక్కల దగ్గరగా వెళ్ళింది. అక్కడ మొదటి రెండుజడలమ్మాయి నాలుగైదు ఇటుకలు చేర్చి పొయ్యి తయారుచేసి దానిమీద ఎసరు పెట్టింది. అన్నం వుడుకుతున్నట్టుగా శబ్దం వస్తోంది. మొదటి రెండు జడలమ్మాయి పుల్లల్ని సరిచేస్తూ ఎసనదో తెలీక బాధపడుతోంది. పచ్చికొయ్యలు మండనంటున్నాయి. పొగ విపరీతంగా వస్తోంది. లక్ష్మీకుమారి పొగతో బాధపడలేక రుమాలుతో కళ్ళు నీళ్ళు తుడుచుకుంటోంది.

"ఏం వంటయిందా!" అంది ఎగతాళి శత్రువుల వనలించేలా రెండవ రెండు జడలమ్మాయి. మొదటి రెండు జడలమ్మాయి చూచీ చూడనంది. ఆమె మాపుమానీ లక్ష్మీకుమారి మౌనం దాల్చింది.

"అవలేదు!" సీరియస్ గా జవాబిచ్చింది మొదటి రెండుజడలమ్మాయి.

"ఇంకా ఎంతసేపు! పదకొండు దాటింది! ఇంతసేపు ఏ ఆటలాడుతున్నారు?"

"పేకాట!"

రెండవ రెండుజడలమ్మాయి ముఖం కందిపోయింది. అవమానంతో కృంగిపోయింది. తన పార్టీ సభ్యురాలు గీత అక్కడలేదు తనను వెనకేసుకొచ్చేందుకు, వంటకోసం కేటాయించిన ముగ్గురిలోనూ ఇద్దరు, శత్రువులు. ఒకరు మిత్రులు. కాని ఆ మిత్రులు కూడా తను అసహాయ స్థితిలో నున్నపుడు ఆదుకోడానికైనా అక్కడ లేదు.

"గీతేది?"

"అలా గార్డెన్ లోకి వెళ్ళింది రాణీ! ఉద్యానవనం పాలన చెయ్యడానికి!" అంది లక్ష్మీకుమారి పొయ్యిమీది వంటకం గరిటతో కలుపుతూ.

"శారదా, సుశీలా బిందెలు తెచ్చారా"!

'లేదు! ఇంకా రెండు కాగులూ నెమ్మదిగా తమపనులు మానుకుని తెస్తారు"! అంది వెటకారంగా లక్ష్మీకుమారి.

ఇంక అక్కడ వుండడానికి రెండవ రెండు జడలమ్మాయికి మనస్కరించలేదు. మొదటి రెండు జడలమ్మాయి తీరిగ్గాకూచుని ఆంధ్రపత్రిక చదువుతోంది. ఆ అమ్మాయి ప్రక్కగా అప్పుడే తయారుచేసిన బంగాళా దుంపలకూర, పప్పు, మామిడికాయపచ్చడి, సాంబారు ఘుమ ఘుమ లాడుతున్నాయి.

రెండవ రెండుజడలమ్మాయి వెనుదిరిగింది, వెళ్ళి తన స్నేహితురాళ్ళను పరామర్శించి రద్దామని అడుగువేసుకోయి ఆగిపోయింది...

దూరంనుండి సుశీలా, శారదా ఒగర్చు కుంటూ కంగారుగా తనవైపు పరుగెత్తుతూ వస్తున్నారు. దగ్గరకు వచ్చేరారు.

"ఏమిటంత ఒగర్చుకుంటూ వచ్చారు?" అంది శాంతంగా రెండవ రెండు జడలమ్మాయి,

"జ్యోతీ!" అంటూ ఇద్దరూ అలాగే క్రింద కూర్చుని భయంగా చుట్టూ చూస్తున్నారు.

"అసలేం జరిగింది? ఎందుకంత కంగారు!"

అయిదు నిమిషాలో సుశీల తేరుకుంది.

"జ్యోతీ! నీ లీడర్ షిప్పు, నీ పిక్నిక్ పార్టీకి చేతోదండం! మేం పోతాంముందు!"

"అసలేమయింది చెప్పరేం?" ఆతృగా అడిగింది మొదటి రెండు జడలమ్మాయి

"ఏం చెప్పమంటావే! వమ్మా. సుశీ నా వెనకాల అడిగి బిందెలు తెమ్మన్నారుగా! తోటల్లో ఎవర్నడిగినా ఇవ్వనన్నారు. నేనూ సుశీలా ఇద్దరం కొంతదూరం వెళ్ళేసరికి ఒక మేడ కనిపించింది. గేటు దాటి లోపలి అరుగుదగ్గరనుండి 'ఏమండీ' అని కేక వేశాం! లోపలినుండి ఒక ఇరవై రెండేళ్ళ కుర్రాడు "ఎవరు కావాలి?" అన్నాడు. మేం ఇలా బిందెల విషయం చెప్పేం, వాడు ఒక నిమిషం ఆలోచించేడు. మనల్ని గురించి అడిగిన తరువాత అతను "మేడ మీద వున్నాయి! చాలా వున్నాయి! మాకు అవసరం లేక వాటి నలాగే వుంచేసేం! పదిహేను వున్నాయి. మీకు కావలసినన్ని తీసుకొని తిరిగి సాయంత్రం ఇచ్చెయ్యండి! అన్నాడు.

మేం సరే అని అతను చూపించినట్లు మేడమీదకి వెళ్ళి నాలుగైదు గదులున్న చోటికి చేరేం అక్కడ ఇంకొక పాతికేళ్ళ కుర్రాడున్నాడు. అక్కడ బిందెలూ లేవూ ఏమీ లేవు. మా ఇద్దరికీ భయం వేసింది: వెళ్ళిపోతాం అని వెనక్కి తిరగబోయాం.

అంతే! ఇద్దరుకుర్రాళ్ళు మా చేతులు గట్టిగా పట్టుకున్నారు...... మేం పెనుగులాడేం...ఎలాగైతేనేం బయటపడి ప్రాణమానాలు దక్కించుకుని ఇలా వచ్చేం! నీ పిక్నిక్కూ నీకూ ఓ నమస్కారం మేం పోతాం!" అంది కళ్ళనీరు తుడుచుకుంటూ శారద.

రెండవ రెండు జడలమ్మాయి ఒళ్ళు దహించుకుపోతోంది,

"పదండి! ఈ సంగతి హెడ్ మిస్ట్రెస్ గారితో చెప్పి వాళ్ళరోగం కుదుర్చుదాం"

"వద్దు జ్యోతీ! అయిందేదో అయిపోయింది బుద్ధి వచ్చింది! అనవసరంగా హెడ్ మిస్ట్రెస్ దగ్గరకు వెళ్ళకు! ఎవ్వరికీ చెప్పకు! నలుగురిలోనూ అల్లరయిపోతాం" అని ప్రతిమాలింది సుశీల.

"సరే పదండి! మిగతా వాళ్ళందరూ ఏం చేస్తున్నారో చూద్దాం! అంది రెండవ రెండు జడలమ్మాయి. ముగ్గురూ బయలు దేరారు.

దారిలో కాలువ ప్రక్కగా వున్న పెద్ద చింతకాయ చెట్లకిందలో శకుంతల, మేరీ కూర్చుని సంగీత సాధన చేస్తున్నారు.

రెండవ రెండు జడలమ్మాయి వారి వైపు చూసింది

వాళ్ళు ఈమె వైపు చూసేరు...

చూసి కిలకిలమని వికలిగా నవ్వేరు...

లీడర్ అవస్థ చూసి...తమ పార్టీ కాదని.

సుశీల, శారదా, సంగీత మాధుర్య కోకిలలిద్దరి మీంగొద్దామన్నంతగా కోపం తెరిచారు.

"పోనిద్దూ! అజ్ఞానం!" అంటూ రెండవ

---

## వచ్చిన కారణం?

తిరుమల దేవస్థానం వద్దకు వచ్చిన ఓ తాసామి ఒకసత్రములో ఒక గది తీసికొనేందుకు మేనేజరు దగ్గరకు వచ్చాడు. డబ్బు చెల్లించిన పిదప రిజిష్టరులోని ఒక్కొక్క విషయాన్ని పూర్తిచేస్తూ ఒక 'కాలం'లో వున్న 'వచ్చిన కారణం' అన్న విషయాన్ని చూచి తెల్లబోయి పకపక నవ్వేసాడు. అది మేనేజరు చూసి తనకూ అర్థమైనట్లు అతనితో శ్రుతి కలిపాడు.

— కె. కామేశ్వరరావు,
(జోలాపుట్).




## అభిషేక పర్వం--5

లలితా లోకములన్
మనోజ్ఞ మధురాలాపంబులన్
విస్ఫుర త్కలహాసంబుల
బంధుర స్తన భరోత్తానంగ సంగంబులన్
విలసద్వ క్త్రి సరోరుహార్పణములన్
స్నిగ్ధోరు సంవేష్టనంబులఁ
బూజించిరి గోపభామలు
జగత్పూజార్హు దామోదరునిన్.

—హరివంశము.

నీల మనస్సును పోలి, శ్రీకృష్ణదేవుని మహస్సును పోలి ఆరాత్రి వెన్నెలలు కాశాయి. గోపికల హృదయాలను పోలి వెల్లివిరిశాయి. ఆ వెన్నెలలలో బృందావనం మన్మథదేవుని స్కంధావారాన్ని పోలి కన్పిస్తున్నది. మన్మథ మన్మథుడైన గోపాల దేవుణ్ణి దర్శించడానికి అనిమిషులు తరలివచ్చినట్లు అంబరతలం నక్షత్రగణ పరివేష్టితం అయివుంది. ఆ నక్షత్రాలమధ్య పాలసముద్రంలో విష్ణువును పోలి, కైలాసంమీద శివుణ్ణిపోలి, సత్యలోకంలో హిరణ్యగర్భుణ్ణి పోలి, త్రివిష్టపంలో ఇంద్రుణ్ణి పోలి, ప్రసాదగుణం కలిగి, విభూతి లక్షణం కలిగి, సత్వమూర్తియై, వేయి కన్నులుగా, చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. అతని కన్నుల కాంతి విరిసినంత మేర కలువలు వికసించాయి. చక్రవాక మిథునములు చకితములై పోయినాయి. చకోరపక్షులు భోగమాధుర్య పరవశులయినాయి. విరహుల హృదయాలు తల్లడిల్లాయి. చెలువలు సైరణలు దక్కి చిక్కులలో పడ్డారు. మన్మథుని ఆయుధాలు ఐదే అంటారుగాని, చంద్రుడు అతని ఆరో ఆయుధం. అందుకే కాముకులు చంద్రుడు కురిసే చల్లని వెన్నెలలలో, అణువు అణువునా, చంద్రునిప్పులు చిమ్ముటను మాత్రమే చూడగల్గుతున్నారు. పంచబాణుని దివ్య అగ్నిగుణానికి చంద్రునిలో మూర్తికల్పనం జరిగినవలె కన్పిస్తున్నది. అందుచేతనే ఆరాత్రి బృందావనం నాల్గుదిక్కులు శరత్ చంద్ర చంద్రికా సంజ్వలితాలయి పోయినాయి. ఆ వెన్నెలలు ప్రసరించినంతమేర, వ్రజాంగనా హృదయ సంగృహీత శ్రీకృష్ణ పదార్పిత రహోవిరహ మాధుర్యం, కరిగిన బంగారాన్ని పోలి, తేనై, వెన్నెలై ప్రవహించింది. యమునా సైకత సికతాతలాలలో ఒంటరియై తిరుగుతూ, శ్రీకృష్ణదేవుడు యోగమాయా సమాశ్రితుడై, దివ్యకాముక క్రీడాగతి బుద్ధియై, క్రొత్త అందాలను స్మరించుకుంటున్నాడు. క్రొత్త ఆలోచనలు చేస్తున్నాడు. చంద్రుడు కరిగి ప్రవహిస్తున్నట్లు యమున; చంద్రుని కిరణాలు పెల్లులై వుబుకుతున్నట్లు ఇసుకలు; చంద్రుని కిరణాలు ఓషధులను కరిబుగా వికసించిన వనాలు; వనాలలో చెట్టుచెట్టుకు సుమన స్సంపన్నాలయిన పుష్పాలు; పుష్పాలను పోలిన వ్రజసుందరీవదన సౌందర్య శోచిస్సులు, చంద్రమరీచికా శోచిష్కాలై, శ్రీకృష్ణదేవుని మనోవకాశంలో విచిత్రమైన కౌముదీపులకలను రేకెత్తిస్తున్నాయి. తనయౌవనము, శరద్గగనపు సర్వము, శారద రాత్రులయందుగల సుఖోచిత రమ్యభోగములు, తనమనస్సులో తరితీపులు రేపగా గోపాలదేవుడు క్రొత్తయిచ్చలకు మచ్చికపడి చోద్యమైన నిశ్చయాలకు వచ్చివేస్తున్నాడు. గోకులంలోవున్న పడుచులందరు తనకోర్కెలను పలికే లీలాపాత్రములుగా ఒడగూరి వచ్చేందుకు తగు ఉపాయములనుగూర్చి ఆలోచిస్తున్నాడు. కందర్పుణ్ణి పరమశివుడు జయించిన పద్ధతి ఒక్కటి; తాను ఇంకో పద్ధతిలో కందర్ప విజేత కావలెనన్న కోరిక శ్రీకృష్ణదేవునిలో ఊరికలు వోయింది. ఆ కృష్ణుణ్ణిచూచి అదృశ్యసంచారులైన దేవయోనులు ఆశ్చర్యపోయినారు. అతని రూపాన్ని సందర్శించి తాముకూడా కాముకతను భజించారు. అభినవ బర్హిబర్హాపీడలక్ష్మిని ఉల్లాసించే శిఖకలాపము; కమనీయమైన కేయూర కంకణోర్మికలకు తోడువైన, నిడుపైన కేలుదోయి; అమ్లానకుసుమ సముచిత కుసుమ మాలికతో శోభించిన విపులమైన వక్షఃస్థలము; పవిత్ర కౌశేయహార బంధం అలంకారం చేస్తూవున్న పృథుకటీతటి; చిరునవ్వుతో నిండారుతున్న జిగి కల్గిన ఉదార లలిత నేత్రాంచలములు; శ్రీకృష్ణదేవుడు అఖిలైకమూర్తియై, గోపసతులపై కోరికలు మలంగిన తలంపులకు, భావకల్పన చేస్తూవుంటే చూస్తూ వారు విస్తుపోయారు. శ్రీకృష్ణుడు యమున ఇసుకలలో కదలడం వారు చూచారు; చూడలేదు. యమునాతటాన్ని అధిరోహించడం చూచారు; చూడలేదు. యమునానదీజల సమీపతాలైన వనాలలో ప్రవేశించడం చూచారు; చూడలేదు. వారు సుధాంభోధిని మథిస్తున్నట్లు ఉన్న వేణుగానాన్ని మాత్రం విన్నారు. జగన్మోహనంగా ఒక్క గీతాన్ని ఆ వేణువుమీద గోపాలచక్రవర్తి ఆలపించగా ఆలకించారు. బర్హాపీడుడు; నటవరవపువు; చెవులలో కర్ణికారములు ధరించినవాడు; సందువెన్నెలలో సురపొన్న చెట్టుక్రింద వ్యత్యస్తపాదారవిందుడై నిలబడినవాడు; గోపాల చక్రవర్తి వేణురంధ్రాలను అధరసుధారసంతో పూరిస్తూ, బ్రహ్మగీతాన్ని సర్వభూత మనోహరంగా ఆలపించడం విన్నారు. సర్వభూత ప్రకృతి ఆ గీతాన్ని విని పులకితమైపోయింది. ఆ దివ్యధ్వని యింపునకు గోవులు ఆదిగాగల లోకోత్తర జంతువులు అవటగా చెవులొగ్గి, ఉలములు విడి, ఓసలు మరచి, భ్రాంతితో ఎంతగానో సాగనపోయినాయి. ఆ వేణురవ పూరంలో గోపకులు మునిగి, ఆనందరసశ్రీ పరిణతిచేత, అతీంద్రియమైన వ్యాపారములను అన్నింటిని వదలి విచేష్టులయిపోయినారు. గోపికలు పరాయత్తచిత్తలయి తత్తరపడి, ఏ పనులకు చేతులాడక, అనంగవర్ధనమయిన ఆ గీతం చెవిని పడగానే. శ్రీకృష్ణ గృహీతమనస్కలయి, ఒకరిని ఒకరు చూచుకోక, చలలోలకుండలలై, యమునాతటస్థ వనప్రదేశాలకు, ఆ గీతాన్ని అంటి, తద్గీత ధ్వని మార్గాన్ని బట్టి పరుగులు తీశారు. శ్రీకృష్ణుని వేణుగానరవం వినిపించగానే గోపికలలో ఐహ్యకర్మ సంబంధ బంధనాలు తొలగిపోయాయి. అంతకుముందు చేస్తున్న ఏ పనిమీద వారిచేతులు ఆడలేదు. పాలు పితుకుతున్నవాళ్ళు పితుకుతున్నట్టే బయలుదేరారు. పొయ్యిమీద పాలు పెడుతున్నవాళ్ళు పెడుతున్నట్టే ఇళ్ళు వదలిపెట్టారు. పాలు దింపుతున్నవాళ్ళు దింపుతున్నట్టే ఇవతలికి వచ్చారు. ఒక గోపిక అప్పుడే రోసట్లో బియ్యం పోసింది. ఎవరు ఏమనుకుంటారో చూచుకోకుండానే ఇల్లు వదలిపెట్టింది. ఇంకొకరుక పిల్లవానికి పాలు ఇస్తూ, ఇస్తున్నవాణ్ణి ఇస్తున్నట్టే వదలిపెట్టి బయలుదేరింది. భర్తలు భోజనాలముందు కూర్చున్నారుకాని, వారి భార్యలు, వడ్డిస్తున్నవాళ్ళు వడ్డిస్తున్నట్లు, వారి దిక్కు చూడక, ఎక్కడో నక్కులవలు ఒక్కలించి, వారిని అక్కడే వదలి, అడ్డువసి విదలించుకొని, ముంగురు సందడించి దండిడితో చెందొవల విందు విందులు చిమ్ముతున్న వెన్నెలలో యమున దిక్కుముఖమై, దిక్కులు చూడక, అక్కవల చెక్కవలు పిక్కటిల్లగా

# హరివంశము

నిక్కిన జన్నంగలు అమందగమనులూచి ద్రుతస్పందనములుగా ఆ స్పందనం చేశాయి. వస్త్రం సరిగ్గా ధరించామా, నగలు సరిగ్గా పెట్టుకున్నామా, ముఖం చక్కదిద్దుకున్నామా, కన్నులకు కాటుక పెట్టుకున్నామా, అంగోద్వర్తనాది కర్తలు పూర్తిచేసుకున్నామా, అన్న విచారమేమీ వారికి పట్టలేదు. వీరు భర్తలు; వీరు తండ్రులు; వీరు తల్లులు; వీరు అన్నలు; వీరు చుట్టములు; మనల్ని వారిస్తున్నారు; మనము ఏమి చేస్తున్నాము; అని అనిపించలేదు. గోవిందావకృతచేతస్కులైనవారిని ఎవ్వరు ఏమి చేయలేకపోతున్నారు. దేహబంధాలు ఏవీ వారిని బంధించలేకపోతున్నాయి. తమకు ఒక దేహం ఉంది; ఆ దేహానికి ఒక గుణం ఉంది; అన్న సంగతే వారు మరచిపోయినారు. వారికి అప్పుడు మరుపురానిది ఒక్కటేవుంది. అది గోవిందదేవుని దివ్యగానం; వారికి అప్పుడు మరుపురానిది ఒక్కటే వుంది. అది గోపాలదేవుని దివ్యమూర్తి; వారికి అప్పుడు మరుపురానిది ఒక్కటే వుంది. అది అవధులులేని ఆనందం; ఆ మధుర గానం వారిలో దివ్యకామాన్ని రేకెత్తించింది. ఆ మూర్తి వారిలో దివ్య ప్రణయాన్ని మోసులెత్తించింది. ఆ ఆనందం వారిలో సర్వ ప్రాకృతికర్మనివర్తకమయిన తాదాత్మ్యాన్ని సంధానం చేసింది.

నీల ఎప్పుడువచ్చి వారిని కలుసుకున్నదో వారు చూడలేదు. వారు జతలుగా, గుంపులుగా, ఏకరుగా గుటుములుకట్టి, మందయానలయ్యి, అమందయానంగా మందవదలి ముందుకు కదలిపోతున్నారు. శ్రీకృష్ణుడు వేణువుమీద తారమంద్రక్రమంగా, ఉచ్ఛ్వాసాంశు ధ్వని ధరాన్మనుసారిగా, ద్రుతమధ్యవిలంబితాఖ్య త్రిమాత్రలయకృత క్రమంగా, లయాత్మక తాళవిశ్రాంతి కాలానుగుణంగా, వీణాంగ ధ్వని వన్నియతిబద్ధస్వరక్రమంగా కలపడాన్ని పలికిస్తూవుంటే, ఆ పలుకుతున్న పద్ధతినిబట్టి, వారి గమనం, మధుర సంగీత గ్రామాలకు పోలికలు లేగా సాగిపోతున్నారు. నీల ముందు వారివెనుక వున్నది. అంతలో వారిముందుకు వచ్చింది. అంతలో కృష్ణుని వేణువు క్రొత్త పోలికలు తిరిగింది. గోపికలకు ఒళ్ళు ఝల్లుమంది. వారు యిప్పుడు ఆ సంగీతమాధుర్యాన్ని ఆనందించగలుగుతున్నారు. ఒకరితో ఒకరు ఆ సంగీతమాధుర్యాన్ని గూర్చి చెప్పుకుంటున్నారు. కొందరు ఆ వేణువుయొక్క భాగ్యాన్ని అభినందిస్తున్నారు. కాని వారిలో ఏ ఒక్కరికీ నీలకు తట్టినభావం తట్టలేదు. నీల అన్నది: ఓ సఖియలారా! ఈ వేణువు ఎంత పుణ్యంచేసుకున్నదే! స్వామి అధరరసాన్ని అంతా అదే త్రాగివేసింది. దానికివున్న స్వాతంత్ర్యం ప్రపంచంలో ఇక ఎవరికీ లేదు లేవుంది. యధేష్టంగా స్వామి అధరసుధను గ్రోలుతున్నది, మనకు ఇంతగానైనా మిగులుస్తుందో మిగల్చదో కదా! ఆ వేణువు చేసుకున్న పుణ్యమే పుణ్యము. అది పూర్వభవంలో ఏమితపం చేసిందో కదా!" అందరూ దానిమాటలువిన్నారు. దాన్ని చూచారు. వారి ఆనందం అప్పుడు క్రొత్తపోకలుపోయింది. "నీలే! నీలే! నిన్ను మరచిపోయినాము. నమ్మలేని మేము మరచిపోయినాము. మన సఖులంతా వస్తున్నారా? ఓ సుందరీ! రాజీవనేత్రుడు బృందావన వీధిని వేణువు వాయిస్తున్నాడు ఆ గాంధర్వ సంగీతాలు బ్రహ్మగీతాలను బోలి మాలో విచిత్రమైన వేదనలను రేకెత్తిస్తున్నాయి. నీలీ! ఆ గీతారవం వినగా మా చిత్తాలు తలంకిపోయినాయిగదే!" అని దానితో చెప్పుతున్నారు.

వేణురవం అంతకంతకు అద్భుతమైన మాధుర్యాలను విరజిమ్ముతున్నది. పురుషునివల్లచేత మనస్సు శోధనుడుబెంది, శరీరవహ్నితో ఒరసి, ఆ వహ్నితో కలిసి మాధుర్యాన్ని తోడి, ఆ వాయువుతో బ్రహ్మగ్రంథిపై నుండి, ఊర్ధ్వగతంగా పోయి, హృద్గతి మస్తకానవములనే త్రిస్థానాలలో సంస్పృష్టమయి, నాభి, హృత్పుటము, కంఠము, ఉత్తమాంగము, ఆశ్యదేశాలలో స్వరమర్యాదమై చరించి, బ్రహ్మపదార్థం విశ్వమైనట్టు, సప్తస్వరవ్యాహారంగా, గానరసం శ్రీకృష్ణదేవుని సుషిరరంధ్రాలనుండి ప్రవహించి, బృందావనాన్ని ఆవరించిన వెన్నెలలో వెన్నెలై, చలనిగాలిలో గాలియై, యమునాజలసమేధితమైన ప్రకృతి రామణీయకంలో రామణీయకమై. వృద్ధమధ్యమ గాంధర్వగ్రామ విభేదాలను విస్ఫురించరానిదౌతూ, అనంతమైన బ్రహ్మగీతాన్ని బోలి సర్వలోక మనోహరంగా జీవకోటినంతా వివశులను చేస్తూవున్నది. దేవతాస్త్రీలు భర్తలతో కలిసి ఆకాశంలో విమానాలలో పోతూ, గోపాలదేవుని మురళీరవం చెవులకు తగలగానే తమ్ము తాము మరిచి, ధైర్యాలు కోలుపోయి, మోహాన్ని పొందుతున్నారు. కబరీపాశాలు వీడటం, నీవి గ్రంథులు సడలటం, చూడలేక పోతున్నారు. పంచాశుగభ్రాంతలై, వివశలై, నాథుల అంకమధ్యాలలో వాలుతున్నారు. మూఢమతులైన తిర్యగ్జాతులు కూడా ఆ గానాన్ని ఆలకించి కృతార్థాలవుతున్నాయి. శ్రీకృష్ణుని వేణునాదాన్నివిని ప్రణయ సహితములైన అవలోకములతో అతణ్ణి పూజిస్తూ తన్మయీభావంలో చొక్కుతున్నాయి. చొక్కిన మనస్సులతో బృందావనంలో పక్షిలోకం మునిలోకం అయిపోయింది. శ్రీకృష్ణ దర్శనంచేత, శ్రీకృష్ణుని వేణువునుండి ఉదితమై వస్తున్న బ్రహ్మగీతాన్ని ఆలకించటంచేత, అవి మునులకన్న మిన్నయైన తపస్సు చేసున్నవి అవుతున్నాయి. ఇప్పుడు ద్రుమభుజాలను అధిరోహించి. గోవింద ప్రకటిత కల వేణుగీతాన్ని వింటూ నిమీలిత నేత్రములై. విగతాన్యవాదకములై, బ్రహ్మభావాన్ని భజిస్తున్నాయి. బృందావనంలో నదులసంగతి చెప్పనే అక్కరలేదు. అవి ఆ వంశీరవాన్ని ఆకర్ణించి ఆవర్తలక్షిత మనోభవభగ్న వేగములై, తరంగ హస్తములు సాచి. కమలోపహారములతో, శ్రీకృష్ణదేవుని పాదపంకజములను పూజిస్తున్నవిపోలె పరిభ్రమిస్తున్నాయి. "ఈ నదులజలాన్ని గ్రోలేవాళ్ళకు ఎంత ఇంతదైంది. ఈరోజున ఈ నదులు సత్పుత్రులను కన్న తల్లులనుబోలి, అంగాలే, ఉప్పొంగుతున్నాయి. వికసిత నీలోత్పలవన మిషచేత రోమాంచితాలు అవుతున్నాయి. మధుపారావములచేత ఆనందాశ్రువులు ఒల్కుతున్నాయి. తుంగతరంగ హస్తవటనోద్యోగంతో ఆనందాన్ని ప్రకటిస్తున్నాయి. అంత అదృష్టం మనకు కల్గుతుందా?" అంది నీల. అని మళ్ళీ యిట్లా అంది: "సఖియలారా! మనం ఎక్కడో ఎవరికో పుట్టినదానికంటే ఈ యమున ఒడ్డున వంశకృతులమై పుట్టివుంటే బాగుండేదికదా! అట్లా పుట్టివుంటే, ఇప్పుడు స్వామి అధరసుధారసపానం అలవోకగా లభించి ఉండేదికదా! ఓ వంశమా! నీవు ఇట్లా నందతనయుని అధరామృతాన్ని గ్రోలే సుషిరాగిని అయేందుకు ఏమినోములు నోచావో మాకుగూడా చెప్పరాదా?" తక్కిన గోపికలు "అవును! అవును! ఓ కోకిల కులంబువనాళీ! ఈ నందతనయుని స్మృతముల క్రోలెడి వేణువవకునో మేలాగున నోచవచ్చునో! మాకు గూడ యెరిగింపగదవే!" అంటూ పశ్చాత్తాపాన్ని చూపించారు.

ఘన మధురగీతనినదంవిని చెట్లలోవున్న పక్షులందరు సముత్సుకలై చిత్తుముత్తి తనపాలికి చనుదెంచడం యదుశింహుడు గమనించి మందస్మితసుందరంగా వేణువులో క్రొత్త గమకాలను తోడిపోశాడు. నీలను చూచి క్రొత్త సంగతులను పల్కించాడు. వారికి రాగములు కుతుకబంటి అయినాయి,

బజారువైపు బయలుదేరాడు.

శేఖర్, సూరి, కమలనాథ యింకొంత మంది మిత్రులు నవ్వుతూ తనవైపు రావడం చూచిన చంద్రం లేని నవ్వు తెచ్చుకుంటూ వారిదగ్గర చేరాడు.

"ఏరా చంద్రం, కంగ్రాచులేషన్స్‌రా" శేఖర్ పలకరించాడు.

'థాంక్స్" చిరునవ్వుతో చంద్రం సమాధానమిచ్చాడు.

"ఒక్క కాఫీతో మమ్మల్ని వదిలించుకో లేవురా" అసలు చంద్రం ఒట్టి కాఫీయే యిప్పిస్తాడన్నట్టు సూరి అలరిచేశాడు.

"ఆ! అదేంమాట. మనచంద్రానికి తెలియందా! ఓ స్వీటు, ఓ హాటు; ఓ కూల్ డ్రింకు. అంతేగా" అనేమో చాల తక్కువైనట్టు ఆమాత్రం చాలన్నాడు కమలనాథం.

"అంతేనా! అలాగైతే నా కొక్కస్తా అర్జంటు పనుంది. సరలా కలుద్దాం" అందరితో కరచాలనం చేసి వారిని వదిలి తను ముందుకు సాగాడు.

"ఏమయ్యా నీకేదో వొచ్చిందంటనే" అన్నమాటలు విన్న చంద్రం యింకొని రెత రినుకుంటూ తిరిగి చూశాడు. వారెవరో గారు నాన్నగారి మిత్రులు. అందరికీ నమస్కారం చేసి "నాకేమీ రాలేదండి ఏమొచ్చిందంటారు!" అమాయకంగా అడిగాడు చంద్రం.

"అదేనయ్యా ఆదేదో వుద్యోగం దొమ్మల మనుషుల్లో వచ్చిందంటే'" చుట్ట వెలిగిస్తూ వెంకటాచలంగారు అడిగారు.

"అదా అండి! అవునండి. కాని వుద్యోగం......"

"కాని గీని ఏమీ లేదబ్బాయి, ఆవూరెందు చూశావా..."

"చూడలేదండి."

"అరే వినవయ్యా, అది మా బావగారి సొంతవూరు. అక్కడందరూ రౌడీ మూక. పల్లెత్తుమాటన్నామా పట్టలింగే సాయట. నీ మంచితనం నాకు తెలుసులే. నీ గురించికాదు నే చెప్పడం. ముందుగా తెలియపరిస్తే ఎందుకైనా మంచిదని. అదిగాక ఆవూర్లో..." చంద్రం తనమాటలేం వినిపించుకోటం లేదని తెలుసుకొన్న వెంకటాచలం "ఏం చంద్రం ఏదో పనిమీద పోయేట్టున్నావు. ఇంటికేరాగానే, కబురంపు ఆవూరివిషయాలు చాల చెపుతాను."

ఇప్పటికే విసుగెత్తిన చంద్రం "అక్కంకాదండి వెంకటాచలంగారు. నేను నౌకరీ చేయాల్సింది మనుషుల్లో...అదే దొమ్మల మనుషుల్లో కాదండి, అదేదో మరోవూరు. మరి నేనొస్తానండి. నాకొక్క అర్జంటు పనుంది." టక్కు మొహాలతో చూస్తున్న అందరికీ నంస్కారాలు చేసి తను బయలుదేరాడు.

చంద్రం నౌకరీ చేయాల్సిన ప్రదేశం కొత్తది. ఇంతవరకు ఇంటిమించు పట్నవాతావరణంలో పెరిగాడు. వుద్యోగమూ మొదటగా చేయబోతున్నాడు. ఇలాంటి సమయంలో ధైర్యం చెప్పి మంచి సలహాలు యివ్వక యీ భయోత్పాత పడేలా వెంకటాచలంగూడ గాభరా పెట్టేస్తాడేమిటి. వుద్యోగం దుర్గాపురంలో అని చెప్తే "ఏం నాయనా! నువ్వు పోతున్నావా. అది మా అక్కగారి భర్తగారి తమ్ముని గ్రామం. అక్కడ చాల ఖూనీలు ఘోరంగా జరుగుతున్నాయి జాగ్రత్త!" అనేట్టున్నాడు యోచన చేస్తూ పోతున్న చంద్రం సైనూర్ శేఫ్ దగ్గర ఆగాడు. తన అర్జంటుపని తీర్చుకోడానికి బజారంతా ఓసారి తేరపారచూచి హోటల్లోకి దూరాడు.

* * *

ముచ్చటగా మూడు గదులున్న పెంకుటిలుకు "పశువైద్యశాల" అన్న బోర్డు తగిలించి అప్పుడే పదిరోజులు కావస్తోంది. హెడ్డాఫీసులో పదిహేను రోజులు తర్ఫీదు పొంది చంద్రం దుర్గాపురం చేరాడు. తన యిల్లు తీర్చిదిద్దుకున్నాడు. ఒక గదేమో స్టోరు రూము (అదే డిస్పెన్సరీ) అనుకోవచ్చు. చికిత్సకు కావలసిన కొద్దో గొప్పో మందులు పరికరాలతో సహా తన బెడ్, కిట్, ట్రంకు ఇదితర సామాను యీగదిలో యిమిడ్చాడు. మధ్య హాల్లో టేబుల్, చైరు, రెండు బెంచీలు వుంచాడు. అదే తన ఆఫీసురూం. ఎవరొచ్చినా అక్కడే ఇన్‌టర్వ్యూ. మిగిలినగది వంట చెంబులు, గ్లాసులు మరికొంత సామగ్రితో ఇంచుమించు వంటగదిలా తయారైవుంది

కుర్చీలో కూర్చుని రోడ్డువైపు చూస్తున్నాడు చంద్రం. కేసులకోసం అలా చూస్తూ కూచోటం బాగా అలవాటయిందతనికి. తను దుర్గాపురం వొచ్చి మూడువారాలే అయినా ఎన్నో విషయాలు తెల్సుకొన్నాడు. తనావూరొచ్చిన రెండవనాడే కరణం మునసబుల మనస్తత్వాలు గ్రహించగలిగాడు. కరణంగారు చంద్రాన్నాహ్వానించి ఒకరోజు సాయంత్రం చిన్న టీపార్టీ యిచ్చాడు. టిఫిను చేసి హాస్పిటల్ చేరాడో లేదో మునసబుగారు ఎదురయ్యారు.

"మీ కోసమే వస్తున్నానండి. మీరు ఈరాత్రికి మాయింట భోజనానికి దయచేయాలి."

"దానికేం లెండి. మీరలా కూర్చోండి. మరేమీ అనుకోవద్దు. ఈ పూటకు అన్నం మాకొద్దామని వుందండి. కనుక దయచేసి... ......"

"ఆ! అదేం మాటండి. అక్కడ ఏర్పాటు జరుగుతున్నాయి కూడాను. మీ రిప్పుడేం కలనిచ్చినా ఏ పేచీ లేదండోయి. ఈ పూట మాయింట విందారగించాల్సిందే. ఏడుంపావుకల్లా వస్తాను. తయారుగా వుండండి" చంద్రం ఏమో చెప్పాలనుకున్నాడు గాని అదేది వినిపించుకోకుండా అతను బయలుదేరి వెళ్ళాడు.

మునసబుగారింట భోం చేసి తన హాస్పిటల్ కొచ్చి పడుకొన్నాడు. చంద్రాన్నాశ్చర్యపరచిన విషయం ఏమంటే కరణంగారింట టీపార్టీకి హాజరైన ఎవ్వరూ మునసబుగారింట కనబడలేదు. ఇంకో విషయం మునసబుగారింట విందారగించిన ఎవ్వరిన్నీ తను కరణంగారింట చూచినట్టులేదు. తర్వాత్తర్వాత తెలిసొచ్చింది చంద్రానికి కనీసం పదుకంపట మందైనా లేని ఆ వూళ్ళో రెండు పార్టీలని. తన కా విషయం తెలిసిన మర్నాటినుంచి చాలా మెలకువతో మెలుగుతున్నాడు.

"సార్! ఓ డాక్టరు సార్, దీనికి రోగమట్లాగే వుందండి. నే తొందరగా పోవాలి గాని మందిప్పించండి" పాతిక ఫర్లాంగు దూరంలో తన ఎద్దు నుంచుకొని ఓ రైతు అరుస్తున్నాడు. అది విన్న చంద్రం నవ్వుకుంటూ దాన్ని లోపలకు తీసుకురమ్మని చెప్పి తను డిస్పెన్సరీలోకి దారితీశాడు. మందు చేతపట్టుకొని బయటికొచ్చిన చంద్రానికి ఆ రైతు అరఫర్లాంగు దూరంలో మరెవరితోనో మాట్లాడుతూ కనపడ్డాడు. తన దగ్గర కొచ్చిన రైతులందరికీ ఎన్నో సార్లు చెప్పాను జబ్బుందని తోలిన ప్రతిపశువును వెంటనే

పిచ్చి కుదిరింది. కాబట్టి లేవు ఇంటికెళ్ళి పోవచ్చునని చెప్పారు

అతను మర్నాడు పొద్దున్న స్నానంచేసి ముస్తాబై తలదువ్వుకుంటున్నాడు అద్దం ముందు పెట్టుకొని.

వార్డెన్ గుమ్మంలో కొచ్చి త్వరగా రావలసిందని పిలిచాడు.

ఇదిగో వస్తున్నా అని అతడు వెనక్కి తిరిగి చూసేవరకు గోడకి జేరేసిన అద్దం దిగజారి పోయింది. అతను స్తంభించి పోయాడు. అద్దం కేసిచూసి ఒక నిముషం తరవాత, "నా తలకన బట్టంలేదండి. ఎక్కడో పోయి నట్టుంది. ఇంటికెలా వెళ్ళడం" అన్నాడు నిట్టూర్పుతో.

# బదిలీ అయిన వుద్యోగం

తీసుకువచ్చి రోజూ మందిప్పించమని; తను చెప్పినంతసేపు "అట్లాగే సార్" అంటారే గాని తీరా అలా చేయరు. హాస్పిటల్ కొచ్చి మందులు యిచ్చేలోపలే వెళ్లిపోయేవాళ్లు కొంతమంది; ఆ దారి నేదైనా పనిపడితే హాస్పిటల్ దగ్గరలాగో వొచ్చేంగా అని మందిప్పించేవాళ్లు కొందరు; మందీ వార మిప్పించి మళ్లో వారం తిరిగి మానేసే మహానుభావులు కొందరు; ఇలా ఎన్నో రకాల మనుషులను చూశాడు తను.

ఒకరోజు గడిస్తే ఓ ఏడు గడిచినట్లుంది చంద్రానికి. చేతినిండా పని లేక తూగుతూ తూలుతూ కూర్చోవలసి వస్తోంది. తను పట్టణంలో ఎంతో చలాకీగా వుండేవాడు. ఎంతోమందిని తన సరదయిన మాటల్లో ముసాక్కొట్టించేవాడు. తనతో మాట్లాడానికి తన మిత్రులందరూ వెనుకాడేవాళ్లు. అలాంటి తను ఒక్క పల్లెటూరు రైతును సమాధానపర్చాలంటే ఎంతో శ్రమపడాల్సి వస్తోంది. తనకు మంచి సంబంధం చూశామని అమ్మాయి బంగారు బొమ్మని, చెప్పలేనన్ని ఆస్తిపాస్తులున్నాయని, 'ఊ' అంటే చాలు తక్షణం ముహూర్తం నిర్ణయిస్తామని, తనేమో సంబంధం చూపెట్టమని అడిగినట్లు తనదగ్గరికి కొంతమందో వచ్చారు. ఒక పెండ్లి పెద్ద తనకు వివాహం అయిందని ఇద్దరాడపిల్లల తండ్రినని బొంకాల్సి కూడా వచ్చింది. అయినా ఇంత సువిశాల ప్రపంచంలో ఇంక మగవాడే లేనట్లు తన్నే డిమిస్తారేంటి వీరంతా. అందం, ఆస్తి, పలుకుబడి అంతా వుండి, ఒక్క యువకుణ్ణి సంపాదించలేరా వీరు! బోలెడంత ఆస్తి వుందంటారే కట్నాలకోసం అర్రులు చాచే ఈ కాలంలో ఒక్క మగవాడు చిక్కక పోవడం శోచనీయం, వారి దురదృష్టం.

తనిమధ్య న్యాయాధిపతి పనికూడా చేయాల్సివచ్చింది. ఒకరోజెవరో తమకు న్యాయం చేసి పెట్టమంటూ వస్తే తను హాస్యంతో చాకచక్యంతో పరిష్కరించి వారివద్ద మెప్పుపొందాడు. అది జరిగినరోజు మొదలు తను కనీసం ఒకటి రెండు గంటలైనా ప్రతిరోజూ న్యాయాధిపతి పని చేయాల్సివస్తూండేది. ఒకరోజు తనిచ్చిన తీర్పు ఇరుపక్షాలవారికి నచ్చక పోవటంతో వారిద్దరిమధ్య వాగ్వాదం పెరిగి చేతులు కలవటం, వైద్యశాలావరణం యుద్ధభూమిగా మారటం జరిగింది. దాంతో హడలిపోయిన చంద్రం ఆ మరుసటి రోజెవరో వొస్తే "బాబ్బాబు! సెలవిప్పూరు వచ్చింది, నాకు గవర్నమెంటువాళ్లు జీతమిస్తున్నది వైద్యం చేయడానికి గాని తీర్పులు చెప్తూ కూర్చోడానికి కాదండి. మీరు దయ చేసి వెళ్ళండి" అని పంపేశాడు. రోజూ వచ్చే పదిపన్నెండు కేసులు చూడ్డంకన్నా తనకేం పని లేదిప్పుడు.

రోజూ కాలక్షేపంకోసం పొలాలవైపు పోతూంటాడు చంద్రం. అది లేకపోతే తనా వూర వుండేవాడే గాదేమో. తను పట్నంలో చదువుకున్నప్పుడు బీచికి వెళ్తుండేవాడు. ఆ వాతావరణం తన్నెంతో సంతోషంలో ముంచెత్తేది. అలాంటి సౌఖ్యాన్నే తనిప్పుడు పొలాలవద్ద పొందుతున్నాడు. చల్లటి గాలికి ఆపచ్చని పైరు మెల్లగా కదులుతూవుంటే సాగరతరంగాల్లా ఎంతో చూడముచ్చటగా వుంది. ఎండు కసవు తెస్తున్న మనుషులు నిలువెత్తు పెరిగిన పైరులో కానరాక పచ్చని పైరుపై ఎండు కసవుమోపులు వాటంతటవే సముద్రపు కెరటాలపై తేలుతూపోయే పడవలలా ఎంతో రమణీయంగావుంది. యువక రైతులు పదం పాడుతూ ఏతాం మీద కదనం చేస్తుంటే గట్లపై నడుస్తూపోతున్న పల్లెపడుచుల నడక వారిపాటకు నాట్యంలా కన్నులపండువుగా వుంది. ఎటువైపు చూచినా ఏదో వొక వింతశోభ, ప్రకృతి గోచరమవుతుంది. ఎంతో ఆనందం, ఆహ్లాదం దానంతటదే కలుగుతుంది.

తనా గ్రామం చేరి ఏడాదిదాటింది. తన వృత్తిలో ప్రోత్సాహం కొంచెమైనా లేదు. తమకేం పాలుపోవటం లేదు. ఎన్నో యోచనలు వచ్చాయి, పోయాయి. ఆచరణలో పెట్టిన కొన్ని తను తోచిన యోచనలు నిష్ప్రయోజనమైనవి. తుదకు తనకు తోచిందల్లా ఒక్కటే. తీరిక సమయంలో ప్రతియింటి విషయం సమగ్రంగా సేకరించటం వాటిలోని లోటుపాట్లను తనకు సాధ్యమైనంతవరకు తీర్చటం, తద్వారా వారిని తనకు దగ్గరగా చేర్చుకోటం. ఈ యోచనగూళ్ళ మునుపటి వానివలె కార్యరూపం దాల్చింది. నెలతిరక్కముందే కనీసం యిరవది కుటుంబాలలోని కష్టాలు తెల్సుకున్నాడు. తనకు చేతనైన సహాయం చేశాడు. తన్నా కుటుంబాలు ఎంతగానో గౌరవించాయి. ఇదే మంచి మార్గం అనుకొన్నాడు తను. కాని ఎంతోమంది ఎన్నో విధాల వ్యాఖ్యానించారు. తప్పులు పట్టాలని చూశారు. విఫలులైనారు. తనను తన్నా గ్రామంనుంచి పంపేయాలని విశ్వప్రయత్నం చేశారు. ఎవ్వరేమనుకొన్నా తనా వుద్దేశాన్ని మార్చుకోలేదు. ఆ గ్రామాన్ని ఒక త్రాటిపై నడిపించాలని సకల ప్రయత్నం చేస్తున్నాడు.

ఇన్నిరోజులు చంద్రం ఆ పల్లెటూర ఒక డాక్టరుగా మెలుగుతూ వచ్చాడు. కాని తనిప్పుడు వారిలో ఒకడుగా వుంటున్నాడు. తనతో మనసిచ్చి మాట్లాడని చిన్నా పెద్దా ఆ వూర లేరంటె అతిశయోక్తి కాదు. తన మంచిచేత అందర్ని ఆకర్షించి వారి కెన్నో విధాల సహకారం కూర్చి బోధించి తనవశం చేసుకొన్నాడు. ఇప్పుడా గ్రామంలో ఒకే పార్టీ; చంద్రంపార్టీ. కరణం, మునసబులను ఎంతో కష్టంమీద ఒకటిగా కలిపాడు. ఆ గ్రామం అన్నివిధాలా అందరి సహకారంతో ఎంతో పురోగమిస్తోంది. చంద్రం ఆ వూరొచ్చి పదునెనిమిది మాసాలే అయినా ఆ గ్రామంలో కల్గినమార్పు ఎంతో చెప్పలేం.

రోజుకు పది పన్నెండు కేసులు చూచే చంద్రం యిప్పుడు కనీసం యాభై యెనభై కేసులుదాకా చూస్తున్నాడు. చేతినిండుగా పని. తను చూచిన ప్రతియొక్కరూ నవ్వుతూ పలకరిస్తుంటే తనకు చెప్పలేనంత సంతోషం కల్గేది. తనా గ్రామం చేరిన నాటికి ఈ నాటికి పశుసంపద నాల్గురెట్లయింది. తనకింక కావల్సిందేముంది.

తన వుద్యోగధర్మం నెరవేరింది.

ఏ కష్టనిష్ఠూరాలు లేక ఈ నాటికిగదా హాయిగా వుండగలుతున్నాం అనుకుంటున్న చంద్రానికి అప్పుడే ఒక లెటరు అందింది. తన ప్రవర్తన యిక్కడేం బాగులేదని తనపైన ఆరు నెలల క్రితమే రిపోర్టులు వచ్చాయని కాన అతన్ని క్రష్ణాపురం బదిలీ చేసినట్లు అందులో వుంది. ★

---

ఒక హాలీవుడ్ తార "స్వీయ చరిత్ర" పుస్తకంగా వెలువడింది.

నాటితార ఒకామె ఆ పుస్తకం చదివి స్నేహితురాలికి ఫోన్ చేసింది. "నీ ఆత్మకథ చదివాను. చాలా బావుంది. ఎవ్వరు రాసి పెట్టారు?" అని

"థాంక్స్... కాని నీకెవరు చదివిపెట్టారది?" అంది రచయిత్రి.

---

## కితకితలు

తండ్రి (కొడుకుతో): ఒరేయ్ నోరులేని జంతువులను కొట్టకూడదురా.

కొడుకు: నోరులేకపోతే గడ్డి ఎలా తింటోంది నాన్నా.

* * *

బంధువు: ఏమండీ! అలా కళ్లుమూసుకుని అన్నం తింటున్నారు.

గృహస్థు: డాక్టరు జబ్బు నయమయ్యేదాకా నన్ను అన్నం కళ్ళ చూడొద్దన్నాడు.

మేష్టారు: కిరాతార్జునీయం నాటకంలో నేను చిన్నప్పుడొక వేషం వేశాను. అది ఏమిటో చెప్పుకోండి చూద్దాం.

ఒకవిద్యార్థి: శివుడు.

మేష్టారు: కాదు.

విద్యార్థి: అర్జునుడు.

మేష్టారు: కాదు.

విద్యార్థి: అయితే వారిద్దరి దెబ్బలాటకి కారణమైన సూకరము.

—గొబ్బూరు రాఘవేంద్రరావు, కాకినాడ.

కలహాప్రసంగాలు రావటంవల్ల అశాంతి కలుగుతుంది. మీబాధ్యతలను నెరవేర్చుతో కలుగుతారు. ప్రస్తుతం మీరుకోరే సంపూర్ణమైనమార్పులు జరిగే అవకాశాలు లేవు. 6, 7 లలో శుభ సంతోషాలు భారమైన పనులు.

* * *

### ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ పా.1)

ప్రతిపని ముందు అసాధ్యంగాతోస్తుంది. కొన్ని సంసార్యాలలో పోటీ, కలహాలు వస్తవి. అన్నిటిని సమర్థించుకుని నిలబడగలుగుతారు. ఆదాయం బాగుంటుంది. సంఘకార్యాలు జయప్రదంగా నెరవేర్చగలుగుతారు. కొంతమంది మీపై మీకు నిమిత్తం ఎదురుచూస్తారు. దూరమందున్నటువంటి బంధుమిత్రుల వద్దనుంచి శుభవార్తలు తెలుస్తవి. ఓర్పులేని వ్యక్తులు కొందరు మీకు, మీ మిత్రులకు మధ్య కలహాలు తెచ్చి పెడతారు. వ్యవహార రంగంలో శ్రమ, ధనవ్యయము అధికంగా ఉంటవి. 3, 4, 5 తేదులలో కార్యసిద్ధి. వృత్తిలో అనుకూలత, అభివృద్ధి, శత్రుజయం.

### మకరం:

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

ముందు ఎప్పుడో ఉపయోగించే పనుల నిమిత్తం, శ్రమపడవలసి వస్తుంది. తాత్కాలికంగా ధనాదాయం పెద్దగా కనుపించదు. మాట చలామణి బాగుంటుంది. బంధువుల వల్ల అనుకూలత ఉంటుంది. వ్యవహార విషయాలలో మీరు అనుకుంటున్నంత ఇబ్బంది ఉండదు. డబ్బు సర్దుబాటునుగురించి కొంతట ఆందోళన పడతారు. అయినా సమయానికి సహాయం లభిస్తుంది. కుటుంబంలో సుఖ సంతోషాలు లభిస్తవి. పుణ్య కార్యాలకు మొదట ఆటంకాలు వచ్చినా చివరకు సంతృప్తికరంగా నెరవేరుతవి. వారం ఆరంభంలో మీ ఆరోగ్యం లోపిస్తుంది. 4, 5 లలో ఇతరుల సహాయంతో కార్యసిద్ధి, శుభవార్తలు, ఖర్చులు.

* * *

### కుంభం:

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా)

మీకు సంబంధించిన మనుష్యులే మీ అభివృద్ధికి నిరోధకులు అవుతారు. ఇతరుల వ్యవహారాలలో మీ చాకచక్యంవల్ల ముఖ్య సమస్యలను పరిష్కరించ గలుగుతారు. తొందరపడిచేసిన పనులు కలహాలకు దారి తీయవచ్చు. దైవబలంవల్ల అన్ని రంగాలలోను మీమాటను కాపాడుకో గలుగుతారు. వృత్తి ఉద్యోగాలలో నిర్వహణశక్తి పెరుగుతుంది. హోదా బాగుంటుంది. విలువగల వస్తువులు కొనే ప్రయత్నాలు సుఖంగా జరుగవు. బంధు మిత్రులవద్దనుంచి ఎదురు చూస్తున్నవార్తలు సకాలంలో అందుతవి. చోరభయం కలిగే అవకాశాలున్నవి. 2, 3 లలో మిత్రభేదం, భయంకర వార్తలు.

* * *

### మీనం:

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

ప్రతివిషయంలోను సందేహాలు అధికం. ధనసంబంధమైన శ్రమ కొంతవరకు తీరిపోతుంది. సుఖసౌఖ్యాలు లభిస్తవి. సక్రమంగా జరుగుతూఉన్న పనులు కొన్ని ఈ సమయంలో అడ్డంతిరిగి ఆందోళనకలిగిస్తవి. ప్రయాణాలు అనుకూలిస్తవి. వ్యవహార రంగంలో నిబ్బరం అవసరం. శుభకార్య ప్రయత్నాలు నెరవేరవు. మీ వృత్తి ఉద్యోగాలలో ఒకప్రక్క శ్రమకలిగిస్తున్నా, మరొకప్రక్క ఆడంబరము, గౌరవము బాగుంటవి. పుణ్యకార్యములు యందు ఆసక్తి అధికమవుతుంది. తొందరపడి ఇతరులకు మాట ఈయవద్దు. 4, 5 లలో శుభవార్తలు, సభాగౌరవం అకస్మాద్ధన ప్రాప్తి. ★



# వనితాలోకం

## మర్యాద - మన్నన

ఈ మధ్య ఒక సందర్భములో మా బంధువుల ఇంటికి వెళ్ళాను. నిజంగా ఆ ఇంటి "మర్యాదను" చూసి నేను స్తబ్ధురాలనై పోయానంటే నమ్మండి.

నేను వెళ్ళిన ఆ బంధువులు మాకు దూరపు బంధువులు కాదు. స్వయానా మా వదిన పుట్టిల్లు. అంటే, నేను మా వదిన పుట్టింటికి తమాషాకు వెళ్ళాననుకోకండేం!

మా వదినను మా ఇంటికి (అత్తగారిల్లు) కాపురానికి తీసుకు రావాలి. మా వదిన పుట్టిల్లూ వూళ్ళోనే యితే. మావాళ్ళు, ఆడవాళ్ళు వెళ్ళి పిల్లను తీసుకొస్తే మంచిదని తీర్మానించి, చివరకు నన్ను తరిమారు. నేను ఆడబిడ్డ హోదాలో వెళ్ళాలి మరి!

వెళ్ళాను.

నేను వెళ్ళేటప్పటికి ఇంట్లో మగవాళ్ళెవ్వరూ లేరు. మా వదిన ముందు గదిలో కూర్చుని యేదో పుస్తకం చదువుతోంది. తన పినతల్లి ఒకామె అక్కడే పిల్లవాడిని ఆడిస్తూ కూర్చునివుంది. తక్కిన ఆడవాళ్ళు లోపల ఉన్నట్టున్నారు. నన్ను గడపలో చూడగానే, మా వదిన లోపలికి పారిపోయింది. ఆ 'పినతల్లి' అనబడే ఆవిడ నా కేసి ఆశ్చర్యంగా చూస్తూ కూర్చుందే గాని, 'లోపలికి రండి', అనిగాని, 'కూర్చోమని', గాని అనలేకపోయింది. బహుశా ఆవిడకు కళ్ళార్పకుండా అందర్నీ చూసే అలవాటు వుందేమో. లేక ఆవిడకు క్రొత్తవాళ్ళను పలకరించటం సిగ్గో! ఏదో గాని, మొత్తానికి, ఆవిడ అట్లా చూస్తూ కూర్చోవటం, నన్ను లోపలికన్నా రమ్మనకపోవటం నిజంగా నా ప్రాణం వచ్చినంత పనై, ఎందుకొచ్చానురా బాబూ! అనిపించింది.

సరే! లోపలికి పరిగెత్తిన మా వదిన చెప్పి వుంటుంది. ఇంట్లోనుంచి ఓ అరడజను మంది ఆడవాళ్ళు (వదిన తల్లి, బంధురాలు) బిలబిలమంటూ గుమ్మందాకా వచ్చి నన్ను చూసి గుసగుస లాడటం మొదలెట్టారు. నాకు తగని ఆశ్చర్యం వేసింది. వాళ్ళకు నేనేమీ క్రొత్తకాదు. అంతా నన్నెరుగుదురు. మరేమిటి. 'జూ'లో వింత మృగాన్ని చూసినట్లు, 'ఎగ్జిబిషను'లో క్రొత్త వస్తువును చూసినటు చూస్తారేం! వాళ్ళమీద నాకు కోపమూ వచ్చింది. నా పరిస్థితికి నామీద నాకే జాలి వేసింది. వెంటనే వాళ్ళ అమాయకమైన చూపులకు నవ్వూ వచ్చింది. ధైర్యంగా వాళ్ళవంక చూస్తూ అట్లాగే నుంచున్నాను. చివరకు, మా వదిన తల్లి 'రండి!' అంది.

సి. కృష్ణకుమారి

ఎట్లాగో చొరవ చేసుకుని లోపలికి వెళ్లాను. ఒకచాప వేశారు కూర్చోమని. నిలువుజీతం ఇప్పటికైనా తప్పిందికదా అని సంతోషిస్తూ కూలబడ్డాను. నేను కూర్చున్న ఐదునిమిషాలకు ఆచాపమీద ఒకామె 'కాళ్ళుకడుక్కోండి' అంటూ చెంబుతో నీళ్ళు తెచ్చిచ్చింది.

'కూర్చున్న తర్వాత యేం కాళ్ళులెండి' అని మనస్సులోనే అనుకున్నాను. ఒకళ్ళ మొహాలు ఒకళ్ళు చూసుకుంటూ నిల్చోటం నా వంకో, నా చీరవంకో, నా మెడవంకో చూట్టంతప్ప ఒక్కరూ మాటాడలేదు.

నాకు చిరాకేసుకొచ్చి చివరకు నేనే "మా వదినను మా ఇంటికి తీసికెళ్ళటానికి వచ్చాం! మా నాన్నగారు ఇంతకు ముందే కబురు పంపారనుకుంటాను" అన్నాను అసలు విషయంలోకి వస్తూ.

"ఆ... తెలుసు. అబ్బాయి (అల్లుడు) వస్తారేమో తీసుకెళ్ళటానికి అనుకుంటున్నాం. అల్లుడుగారు రాలేదేం" అన్నది మా అన్నయ్య అత్తగారు. హాతోస్మి! దీని అర్థం, నువ్వెందుకొచ్చావ్! మా అల్లుడినే పంపకూడదా అనేగా. నాకు ప్రకోపం ముంచుకొచ్చిందిగాని అణగద్రొక్కుకొని—

"మా అన్నయ్యకు ఆఫీసువుంది అయినా ఆడపిల్లని ఆడవాళ్ళే తీసుకొస్తే మంచిదని మా నాన్నగారి వుద్దేశం" అన్నాను.

ఇట్లాగే రెండు మూడు కబుర్లు ముక్తసరిగా జరిగినై. ఎట్లాగైతే నేం, మా వదినతో సహా ఇంటికిచేరి 'హమ్మయ్య' అనుకున్నా, పంజరంలోనుండి బైటపడ్డ పక్షిలాగా, ఖైదునుండి బయటపడ్డ ఖయిదీలాగా.

ఇట్లా వుంటై కొందరిళ్లలో మర్యాదల్లో అమర్యాదలు.

ఇందులో అమర్యాదకు తావెక్కడుంది? క్రొత్తమనిషిని పలకరించటం ఆడవాళ్ళకు కొంతమందికి సిగ్గవచ్చు అని మీరు అనుకుంటారని నాకు తెలుసు.

ఇంతకన్నా అమర్యాద ఏంకావాలి చెప్పండి! క్రొత్తచోటికి వెళ్ళేనే కొద్దిగా బాధగావుంటుంది మనకు. పైగా ఇంటికివచ్చిన మనిషి అంతకుముందు చూడనట్లు ఆ మనిషి యెందుకొచ్చిందన్నట్లు, చూడటమే గాకుండా, కనీసం వాకిట్లో నిలబడి వున్న మనిషిని లోపలికి రమ్మని గాని, మర్యాదకు కాళ్ళు కడుక్కోనేందుకు నీళ్ళివ్వటం గాని చెయ్యకపోవటంకంటె అమర్యాద వేరే యేం కావాలి?

మనం ఇంకొకర్ని ఇంట్లో కూర్చోబెట్టుకుని పోషించలేకపోవచ్చు. పంచభక్ష్య పరమాన్నాలతో భోజనం పెట్టలేకపోవచ్చు. అతిథుల్ని రోజులతరబడి భరించలేకపోవచ్చు. కాని, మనం ఇంటికి వచ్చిన వారిని గౌరవించటం, ప్రేమతో పలకరించటం. కనీసం ఆహ్వానపు ఓ చిరునవ్వుతో సత్కరించటమే మర్యాద—మన్ననలకు చిహ్నం.

ఇంకొకరు మనింటికి వచ్చారంటే కేవలం వాళ్ళకు గతిలేకనే మనింటికి వచ్చారని గాని, మనకు ఖర్చు తగిలించటమే వాళ్ళ లక్ష్యమై వుంటుందని గాని వూహించినంత బుద్ధి తక్కువ మరొకటి వుండబోదు.

ఇంటికొచ్చిన వారిని ఒకసారి గౌరవిం

చకపోతే. వాళ్ళు మన ఇళ్ళకు మళ్ళీ రెండో సారికి మనకూ భవిష్యత్తులో వాళ్ళ ఇంటికి వెళ్ళే అవసరం కలగొచ్చు. మనం వాళ్ళింటికి వెళ్ళినప్పుడు వాళ్ళుకూడా నిర్లక్ష్యంగా చూస్తే మనకెంత బాధగా వుంటుంది!

పోనీ, అట్లా ఇంటికి వచ్చిన వారిని పలకరించటం చేతకాదేమో అని అనుకుందామా, అదే ఆ గృహిణి తల్లిదండ్రులో, అన్నదమ్ములో, అక్కచెల్లెళ్ళో రానివ్వండి! నుంచుంటే బాధ పడ్తారేమో, కూర్చుంటే బాధ పడ్తారేమో. అన్నంత ఇదిగా అడుగులకు మడుగులొత్తుతారు.

కొన్ని కుటుంబాల్లో ఆడవాళ్ళ కన్నా మగవారే ఎక్కువగా గౌరవమర్యాదలు చూపిస్తారు ఇంటికొచ్చిన వారికి. మగవాళ్ళు ఎంతసేపని ఇంట్లో కాచుకు కూర్చుంటారు చెప్పండి! మగవారు ఇంట్లో లేని సమయములో ఇంటికొచ్చినవారి అతీగతీ కనుక్కునే దిక్కే వుండదు ఆ ఇంట్లో. అంతే గాదు, అతిథుల్ని వాకిట్లో కూర్చోబెట్టి, అందరూ వంటింట్లో కబుర్లు చెప్పుకునే వాళ్ళని కూడా నే నెరుగుదును.

మరొకరకం మనుష్యులున్నారు. వాళ్ళు పెళ్ళిళ్ళకు దగ్గరచుట్టాలే గాక, దూరపు వాళ్ళనికూడా ఆహ్వానిస్తారు. తీరా ఇంటికెళ్ళామనుకోండి నువ్వు తిన్నావా లేదా అని కనుక్కునే వారు కూడా వుండరు. అసలే పెళ్ళింది క్రొత్తచోటు. కనీసం "తిన్నావా లేదా" అని బంధువుల్ని కనుక్కోకపోతే, వంటింట్లోకి జొరబడి పెట్టించుకుతినే సాహసం యెంతమందికి వుంటుంది!

మా బంధువుల్లో ఒకామె వున్నారు. ఆమె ఇంకొకరి ఇంటికి వెళ్ళే యెంతో మర్యాదగా ప్రవర్తించి, ఆ ఇంట్లో వారికి పనిపాటల్లో కూడా సహాయపడుతుంది. విచిత్రమేమిటంటే, అదే యే పెళ్ళికో ఆవిడ ఇంటికి వెళ్ళామా, "వచ్చారా వెళ్ళారా" అనికూడా కనుక్కోక పోగా, ఎదురుపడ్డా చాలా హడావిడిగా వున్నట్లు అందర్లోంచి తప్పించుకుపోతుంది. ఆవిడ మనస్తత్వం ఆమెకే తెలియాలి గాని, మరొకరికి అర్థం గాదు.

అవీ ఇవీ చెప్పుకొస్తే, కొందరిళ్ళల్లో అల్లుడింటికి వస్తే (కోడలింటికి వచ్చినా సరే) వంటనే పలకరించరు. అసలే అల్లుడి హోదా విలువలు కోసం పాకులాడే రోజుల్లో, అల్లుడు ఇంటికొస్తే సిగ్గుపడి పారిపోయే భార్యా, పనిమీద బయటకెళ్ళిన మామగారు, అల్లుడిని చూసి తప్పుకుని వంటయింట్లోకి దూరే అత్తగారూ—వదినగారూ. ఇంటికొచ్చి కనపడగానే ఒక కుర్చీ వేసుకుని కూర్చున్న అల్లుడికి. అరగంట గడచిన తర్వాత యే చిన్న బావమరిదో వచ్చి పలకరించి, కాళ్ళు కడుక్కోవటానికి నీళ్ళిస్తే ఆ

ఎప్పుడూ ఇంతే—34 శంకర్




అల్లుడికి కోపం రాక యేంచేస్తుంది! ఇళ్ళల్లో మర్యాదలతీరు ఈవిధంగా వుంటే బట్టే ఈ కాలం అల్లుళ్ళకు కోపాలెక్కువయినా అనే ప్రతీతి బయల్దేరింది. (చీటికీ మాటికీ కోపగించుకుని, అత్తగార్ని సాధించే అల్లుళ్ళ సంగతి కాదు నేను చెప్పేది.)

అట్లాగే కోడలు ఇంటికివచ్చినా లోపలికి రమ్మనైనా రమ్మనరు మరికొందరు. మా చిన్నక్కయ్య అత్తగారింట్లో పద్ధతి ఇంతే. మా అక్కయ్య అత్తగారింటికివెళ్ళే అందరూ చూస్తూ వూరుకోవటం తప్ప లోపలికి రమ్మనిగాని, సంతోషంగా పలకరించటం యెవ్వరికీ చేతగాదు మా అక్కయ్య తనంతట తాను లోపలికి జొరబడాలిసిందే! కోడళ్ళని పాతబడ్డ తర్వాత యెవ్వరూ ఆహ్వానించ నక్కరలేదు. అది క్రొత్తలో రెండుమూడు సార్లు అత్తగారింట్లో స్వాగతం పలుకపోతే క్రొత్త కోడళ్ళు బాధపడ్తారు.

కొందరిళ్ళల్లో మర్యాదల తీరు యెంతో ముచ్చటగొల్పుతూ వుంటాయి.

గడపలో అతిథిని చూడటం ఆలస్యం ఆ గృహిణి చిరునవ్వుతో ఆహ్వానించి, వచ్చింది మొదలు వెళ్ళేవరకూ ఆ వచ్చిన అతిథులతో కబురు చెప్పి, ఆ అతిథుల్ని ఆప్యాయతగా ఆదరిస్తుంది ఆ గృహస్థులు పేదవారే అవచ్చు. రోజుల తరబడి అతిథులకు ఆతిథ్యం ఇవ్వలేకపోవచ్చు. కాని, అతిథులు ఇంటికి వచ్చిన ఆ క్షణాన ఆ గృహిణి ఆప్యాయతతో పలకరించినతీరూ, ఆ మాటల్లో వున్న ఆదరణే, ఆ అతిథి హృదయంలో ఆనందాన్ని, తృప్తిని ఇచ్చి, ఆ కుటుంబంమీద ఒక సదభిప్రాయం కలిగి, జీవితాంతంవరకు వీరి ఆతిథ్యాన్ని మరచిపోరు.

'గంగిగోవుపాలు గంటెడైన చాలు', 'ప్రేమతో పెట్టింది పిడికెడైన చాలు', అన్నట్లు. ఆ వచ్చిన అతిథికి మనకేమీ లేక పచ్చడి మెతుకులు పెట్టినా వాళ్ళేమీ అనుకోకపోవచ్చుగాని— అతిథులు గడపలోకి రాగానే మనం ప్రవర్తించిన తీరుమాత్రం వాళ్ళు బాగా జ్ఞాపకం పెట్టుకుంటారు.

ఆతిథ్యంలో పేద, గొప్ప, దూరం, దగ్గర అనే తారతమ్యం వుండకూడదు.

వెనుకటికి ఒకామె కూతురి పెళ్ళికివచ్చిన చెల్లెళ్ళల్లో, గొప్ప చెల్లెలికి వద్దంటున్నా చేతి నిండా నెయ్యీ, పేద చెల్లెలికి పడీపడనట్లు, గొప్ప చెల్లెలికి లడ్డూ, పేద చెల్లెలికి బూరె వడ్డించిందట. అట్లాగే మరొకామె ఒక శుభకార్యానికి బంధువులు రాగా, కూతుళ్ళకూ,—అల్లుళ్ళకు పాతిక్క పదిహేను సార్లు టిఫిన్ పెట్టి, కాఫీ లందించటం, తక్కిన బంధువుల్ని కనీసం ఒకసారన్నా తిన్నారా లేదా అని కనుక్కోకపోవటం.

ఒక శుభకార్యానికి మనం నలుగుర్ని పిలిచినప్పుడు, మర్యాద విషయంలో అందర్నీ సమదృష్టితో చూడాలి. నిజానికి, అటువంటప్పుడే. మన అమ్మాయికీ, మనుమరాళ్ళకీ అతిమర్యాదలు జరపటం మాని, వచ్చిన బంధువులకి తగిన మర్యాద జరిగేటట్లు చూడాలి.

ఈ మర్యాదల విషయంలోనే నేటికీ కొన్ని కుటుంబాల్లో కలతలు రేగి, కుటుంబాలే వేరైపోతున్నాయి. ముఖ్యంగా పెళ్ళిళ్ళలో పెళ్ళివారికి జరిగే మర్యాదల

# మర్యాద - మన్నన

వట లో పాలవల్ల బయటకే కలతలు కుటుంబాల్ని నాశనం చేస్తున్నవి.

మనది ఆంధ్రదేశం. మనం ఆంధ్రులం (ఈ సంగతి వేరే చెప్పనక్కర లేక పోయినా ప్రస్తుతం జ్ఞాపకం తెచ్చుకోవటం మంచిది.) మనజాతి మంచి సంప్రదాయాలకు, గౌరవ మర్యాదలకు పేరెన్నికగన్నది. ఈ విషయంలో యే గృహిణిని ఇతరులెవ్వరూ వేలెట్టి లోపాలెన్న లేనట్లుగా ప్రవర్తించే బాధ్యత గృహిణిదే.

డబ్బు సంపాదించి పెట్టుబడి పెట్టి కుటుంబాభివృద్ధికి తోడ్పడేవాడు గృహస్థు. ఆ ఇంటి సంప్రదాయాన్ని, గౌరవ మర్యాదలను, పేరు ప్రతిష్ఠలను వృద్ధిచేసి, గృహస్థును మంచి సంప్రదాయకుడిగా సంఘంలో నిలిపే బాధ్యత గృహిణిది. అందుచేతే, ఆడది లేని ఇల్లు కల్లు కాడితో సమానమని అన్నారు పెద్దలు.

ఇంటికి వచ్చే అతిథుల్ని సత్కరించే బాధ్యత గృహిణిది. తినటు తింటానికి మిగిలినా మిగలక పోయినా, వున్నదంతా భర్తా పిల్లలకు, అతిథులకు వడ్డించే అలవాటు పొందటం నిరతిశయావసరం. ఇంటికి వచ్చినవారిని చిరునవ్వుతో నమస్కరించి, కుశల ప్రశ్నలు వేసి, గౌరవించే బాధ్యత స్త్రీది.

అంతేగాని, ఇంటికి అతిథి వస్తే, 'కర్మ' 'గ్రహచారం' అనుకు సరిగ్గా పలకరించక, మొహం ముటముటలాడిస్తూ, వున్నదంతా వంటఇంట్లో కూర్చుని తిని, పిల్లలకు పెట్టేసి, భర్త ఇంటికి రాగానే అతిథుల యెదుటే 'ఇంట్లో యేమీ లేదని' పోట్లాట పెట్టుకు కూర్చుంటే, ఇంటికొచ్చిన వారి మనస్సు యెట్లావుంటుందో చెప్పండి!

అందరు అతిథులూ ఇంట్లో తిష్ట వేసుకు కూర్చోవటానికే వచ్చారనుకోవటం పొరపాటు. ప్రేమతో మాట్లాడానికికూడా వచ్చే వాళ్లుంటారు. అందుచేతే అతిథులంటే అలక్ష్యం చెయ్యకండి.

మీరు ప్రేమతో పలకటం నేర్వ వచ్చు. ఖబురు చెప్పటం చేతకాకపోవచ్చు అయితే మర్యాదగా చిరునవ్వు నవ్వండి! 'రండి' అనండి! 'కాళ్ళు కడుక్కోండి', అనండి! 'కూర్చోండి' అనండి! సమయానికి కాఫీపొడి లేకపోవచ్చు పాలు లేక పోవచ్చు. ఒకవేళ వున్నా కాఫీ ఇవ్వటమే మీకు ఇష్టంలేక పోవచ్చు. కనీసం 'మంచి నీళ్ళు కావాలా!' అని అడగండి.

ఈ మాత్రం సత్కారంతోనే ఆ వచ్చిన వారి ముఖం వికసించక పోతే అప్పుడు నన్నడగండి.

కాని! అతిథ్యం ఇచ్చేవారితో పాటు అతిథులకుకూడా నా దొక చిన్న సలహా! ప్రేమగాదే అనుకోండి. మీరు ముటాలిక్కకు వెళ్ళారు. ఆ ఇంటివాళ్ళు సరిగ్గా గౌరవించక పోతే ఎట్లాగో తిరుగు రైలోనే ఇలు చేరుందుకు ఎట్టి సందేహము లేదు. ఇక పేదరికంతో బాధపడూకూడ మర్యాద, మన్నన లను పాటించే ఇంటికే వెళ్లారనుకోండి! వాళ్లు అతిగా మర్యాద చేస్తున్నారుగదా అని రెండురోజులు ఎక్కువగా వుందామనుకోకండి! అటువంటి పరిస్థితుల్ని ఆ గృహిణి సాకబార: కాల్ని, కూర్చి ఒక్క నిమిషం ఆలోచించి వీలైనంతమటుకు త్వరగా ఆంటికి చేరే ప్రయత్నాలు చెయ్యండి. ఈ విధంగా ఇటు మీ గౌరవమర్యాదలూ, అటు సగృహిణి గౌరవమర్యాదలూ కూడా నిల్చి వుంటై.



# కాయావకాయ

ఒక సోదరీమణి మామిడికాయలు కాయలుగానే ఆవకాయ వేసుకొనే విధానం తెలుపమన్నారు. మేము వేసుకొనే విధానం చెప్పుచున్నాము.

ఒక పద్ధతి:

కావలసినవస్తువులు:

మామిడికాయలు 25

ఎండు మిరపకాయలు 15 పలాలు.

(8 సంపులు,)

మెంతులు ½ సోలడు,

ఉప్పు 6 సోలలు,

పప్పునూనె ½ వీశె,

ఇంగువ ½ తులం,

మామిడికాయలు లోక్కుగళసరి, పీచు, ఓటు, పుల్లపులిగి వుండాలి కాయ చిన్నదిగాకాక సైజులో ఉండాలి.

ముందట మిరపకాయలు, ఉప్పు వేరువేరుగా ఎండబెట్టి దంచాలి. దంచినవాటిని జల్లించాలి. మెంతులు, కారం, ఉప్పు ఈ మూడు కలిపి పెద్ద పళ్ళెంలో వాటిని కొద్దిగా నూనెపోసి కలపాలి. తరువాత మామిడికాయలు కడిగి తడిలేకుండా తుడిచి గాలికు చీలికల క్రింద కాయ విడిపోకుండా తరిగి జీడికూసముకోసి శుభ్రపరచాలి. ఇలా శుభ్రపరచిన కాయలలో, పై కలిపిన పిండిని కొద్దికొద్దిగా కూరవలెను. ఈ కూరిన కాయలను జాడీలో పెట్టి మూత పెట్టవలెను. 2 రాత్రులైన తరువాత కాయలను పిడిచి (ఊటలేకుండా) ఎండబెట్టవలెను. ఊట కూడా ఎండబెట్టవలెను ఇట్లు ఒక వారము ఎండబెట్టవలెను. ఈ ఎండపెట్టిన కాయలను ఊటలో ముంచి ఇంగువతో మిగిలిన నూనె కాచి అందులో పోయవలెను ఇది తడికలగకుండా ఏడాది నిలువయుండును వేడిచేయదు.

రెండవపద్ధతి: మామిడికాయలు 25 ఆవాలు - సేరు, ఎండు మిరపకాయలు - ½ వీశె మెంతులు - సోలడు ఉప్పు - సేరు పప్పు నూనె సేరు.

ఆవాలు—సరసావాలు, సంచితావాలు, మామూలు ఆవాలు, కలకత్తా ఆవాలు అను రకములున్నవి. ఇందులో సంచితావాలు ఇందుకు చాలామంచిది.

ఆవాలు, మిరపకాయలు, ఉప్పు, వేరే వేరే ఎండబెట్టి దంచి జల్లించాలి. మెంతులు, ఈ మూడు దంచినపిండి కలిపి పెద్ద పళ్ళెంలోపోసి నూనెతో బాగా ఉండ అయేటట్లు కలపాలి. కాయలు పైవిధంగా శుభ్ర పరచి ఈ పిండి కాయలలో గట్టిగా కూరాలి. కూరడంలో ఏ మాత్రమూ గుల్లగానుండ కూడదు. గుల్లగా ఉంటే ఊరగాయపాడై పోతుంది. ఈ కూరిన కాయలు జాడీలో పెట్టి మూత పెట్టాలి. 3. 4 రోజులైన తరువాత కాయలు తీసి పైన సళ్ళెములో పెట్టి ఊటలో మునగని కాయలు అడుగున పెట్టి అడుగుని పైన పెట్టాలి. ఈ విధముగా రెండుమార్లు చేయాలి. ఇటు చేసిన ఈ ఊరగాయ తడి తగులకుండ మూతపెట్టుకొంటే సంవత్సరం పాటు నిలువ వుంటుంది.

ఎం. లక్ష్మి, (రాజోలు.)

---

పోలీసు ఇన్స్పెక్టరు: (హంతకునితో) అతన్ని ఎందుకు హత్య చేసావు? నీకు జైలుశిక్ష తప్పదు పద.

హంతకుడు: వాడ్ని ఏం చేసినా పాపం లేదు. వాడు అంత దుర్మార్గుడు.

ఇన్స్పెక్టరు: ఏమి చేసినా పాపం లేదా? అయితే అతన్ని బ్రతికించు చూద్దాం

—ఎస్. కోటేశ్వరరావు, మారేడుపల్లి.
సికింద్రాబాద్.

# హరివంశము

(31-వ పేజీ తరువాయి)

మందస్మితం చేశాడు. చేసి ఇట్లా అన్నాడు: "ఇళ్ల వద్ద మీ పతులు మీ కోసం కాచుకు కూర్చుంటారు. అంతులకు మీరు శుశ్రూష చెయ్యాలి. అది సతీధర్మం. పిల్లలు కూడా పాలకోసం ఏడుస్తూ వుంటారు. వారికి పాలు ఇచ్చి సంతోష పెట్టాలి." ఈ మాటలు విని గోపికలు సంరంభక్షుభితస్వాంతలయినారు. కృష్ణుడు మళ్ళీ ఇట్లా అన్నాడు: "నాయందు స్నేహంచేత యంత్రితాశయులై మీరు ఇక్కడికి వచ్చివుంటారు. అది యుక్తమే. నాకు సంతోష కారణం కూడాను. అయితే స్త్రీలకు ఔపపత్యం ధర్మం కాదు. భర్తృ శుశ్రూషణమే స్త్రీలకు ధర్మం. బంధువులను మెప్పించడము, బిడ్డలను పోషించడము, స్త్రీలవిధి. భర్త దుశ్శీలుడైనా దుర్భగుడైనా, వృద్ధుడైనా, జడుడైనా, రోగియైనా, నిర్ధనుడైనా, స్త్రీకి భర్తను అతిచరించడం తగినపని కాదు. కులస్త్రీలకు ఔపపత్యం అస్వర్గ్యం, అయశస్యం; తుచ్ఛం; కృచ్ఛ్రం; భయావహం; ఏవిధంగా చూచినా ఔపపత్యం జుగుప్సితం అవుతున్నది. నన్ను పొందడమే మీ మతం అయితే అందుకు వేరేమార్గాలు వున్నాయి. శ్రవణం ఒక మార్గం; దర్శనం ఒకమార్గం; ధ్యానం ఒకమార్గం; నాయందు భావం చేయడం ఒకమార్గం; కీర్తనం ఒకమార్గం; ఇవి ఎట్లాగూ మీరు చేస్తూనే వున్నారు. అట్లా నన్ను పొందుతూనే వున్నారు. ఇప్పుడు మీరు చేస్తున్న పని ఎంతమాత్రం మంచిది కాదు. తిరిగి ఇంటికి బయలుదేరి వెళ్లండి."

శ్రీకృష్ణుని ఈ మాటలు వ్రజసుందరీమణులకు విప్రియాలుగా వినిపించాయి. వారు విషణ్ణులయినారు. భగ్నసంకల్పలయినారు. వారికి దురత్యయమైన దుఃఖం అనుప్రాప్తమైంది. ముఖాలు నేలకు వ్రాలినంతపని అయింది. వారు అప్పుడు కుమిలిన లతలైపోయినారు. దుఃఖం వేగంచేత కలిగిన వారి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వేడెక్కినాయి. ఆ వేడికి వారి అధరబింబాలు వాడువారాయి. అంగుష్ఠంతో భూమిని వ్రాస్తూ తమ అనుతాపాన్ని వారు ప్రకటించారు. కన్నుల వెంట బాష్పధారలు కురిశాయి. కన్నులకు పెట్టుకున్న కాటుకలు కడిగినట్లు ఆ నీళ్లవల్ల కరిగిపోయినాయి కుచకుంకుమలు కరిగిపోయినాయి. వారు తూష్ణీంభావం వహించి, ఏమీ తోచక నిర్వేదాన్ని భజించారు. వారికి కృష్ణుణ్ణి ఏమి అనాలో తోచలేదు. ఈ క్రూరునికోసం ఆ కాంతలు భ్రాంతలై, సకల వ్యాపారాలను విడిచి పరుగు పెట్టుకు వచ్చారు తనయందు అనురక్తలై వచ్చిన అటువంటివారిని, తమ్మి, ఇట్లా మాట్లాడవచ్చునా! అని కూడా ఈ ఉక్కివుడు అనుకోలేదు. వారి దుఃఖం కోపంగా మారుతున్నది. సంరంభం హెచ్చుతోంది ఆ క్రూరుణ్ణి ఏవో మాటలు అనాలని అనుకుంటారు గాని, అనలేకపోతున్నారు. కోపావేశంచేత వారి కంఠాలకు గాద్గద్యం సంప్రాప్తం అవుతున్నది. వారు మాట్లాడలేకపోతున్నారు. వారి అవస్థను చూచి నీల చాలా జాలిపడింది. శ్రీకృష్ణుడు వారిని చూచి మందస్మితం చేసి, తన్ను చూడగా, తాను, అతణ్ణి చూచి, మందహాసం చేసింది. శ్రీకృష్ణునకు ఇదే విచిత్రమైంది. ఇంతవరకు తన ఎదుట కూడా సరిగ్గ పడని, ఈ సిగ్గుల ప్రెగ్గడకత్తె, ఈ రావడం ఏమిటి? వచ్చిందిపో! తన్ను ఏదో మందలించబోతున్నట్లు ముఖం పెట్టి ఈ మందహాసం చేయడం ఏమిటి? కృష్ణునిలో ఈ ఆలోచన ఇంకా పూర్తి కాలేదు. నీల సిగ్గును వదిలిపెట్టి, భయాన్ని పారద్రోలి, గోపికలయందు జాలిచెందినదై, వారు తనయందు చూపించిన జాలిని తాను తీసుకొని, రెట్టించిన జాలిని పొంది, ఇట్లా అన్నది: "స్వామీ! నువ్వు నిజంగా క్రూరుడవు. నీ అన్న మాటలు నిజంగా వాళ్లను అనదగినవా? సర్వవిషయాలను త్యజించి, నీ పాదములను నమ్ముకొని. ఇట్లా వచ్చారే! నీవు భగవంతుడవని, అచ్యుతుడవని. ముముక్షువులు ఆదిపురుషుణ్ణి భజించే రీతిగా, నిన్ను భజిద్దామని వచ్చారే! స్వామీ! వారిని ఇవేనా అనవలసిన మాటలు! స్త్రీలకు పతులను సేవించడము, బిడ్డలను సాకడము. బంధువులను ఆదరించడము, ఈ అందరిని పాటించడము ధర్మపద్ధతి అని నీవు ఉపదేశిస్తున్నావు. అది సరే. అయితే భగవన్! ఈ పతులు, ఈ సుతులు, ఈ బంధువులు ఎవ్వరు? నీకన్నా వేరైన ద్రవ్యం ఏదిలేదుగదా ఈ గోపికలు నిన్ను భావిస్తున్నారు. ఆ పతిపుత్రాదిక నానామూర్తివై నువ్వు భాసిలుతున్నావని గదా వారు అర్థంచేసుకుంటున్నారు. ఇప్పుడు వారు నీయందే ఆ పతిపుత్రాదికమైన వాంఛలు సలిపి, నిన్ను సంభావించదలచుకున్నారు. ఇది ధర్మపద్ధతి కాదంటావా? నాయందు వీరు రతి ఎందుకు చేస్తున్నారని గదా తమరు ప్రశ్నిస్తున్నారు. ఆ శాస్త్రాలేమీ వీరికి తెలియవు అయినా శాస్త్రకుశలులైనవారిని, నిపుణులయినవారిని. చూదాము. ఎవరు నీయందు రతి చేయడం లేదు? ప్రభూ! నువ్వు నిత్యప్రియుడివి. సతత రసోద్దీపకుడివి. భార్య, భర్త, తల్లి, తండ్రి, పుత్రులు, పుత్రికలు. అన్న కోరికలను త్రెంచకొని వారికి నీయందు రతిచేస్తున్నారే! ఇప్పుడు వీరు ఆ అన్ని బంధాలను త్రెంచుకువచ్చారు. నీయందు రతిచేస్తున్నారు తప్పా? స్వామీ! వారి ఆశలు త్రెంచబోకు. వారి తాపం అతిశయించేట్లు చెయ్యకు. నువ్వు అరవిందనేత్రుడవు కదా! చూపులతో వారి తాపాన్ని వారించు."

నీల ధైర్యం చూడగా. గోపికలకు అబ్బురమైపోయింది. ఈ కృష్ణప్రియ తమకు మాతృక కావడమే వారికి విచిత్రంగా వుంది. కృష్ణునకు అందులో విచిత్రమూ కన్పించలేదు అది అబ్బురమూ అనిపించలేదు. కృష్ణుడు నీలదృష్టిలో ఒక మహాసముద్రం వంటివాడు. ఎన్ని నదులున్నా అందులోపడవచ్చు. అందువల్ల ఆ నదికి చెరుపులేదు. ఆ సముద్రానికి చెరుపులేదు. ఎన్ని నదులు వచ్చిపడినా, అవి ఆ సముద్రుని గుణాన్ని అవలంబించుకోవలసిందేగాని. ఆ సముద్రం ఆ నదులగుణాన్ని అలవరచుకోదు. ఆ గుణం తనది అనుకుంది నీల. గోపికల ప్రేమలో మాధుర్యం వుంది. తన ప్రేమలో ఏమివుంది? దానికి అర్థం కాలేదు. అర్థంకాని అది అంతఃకరణంలో తికమక పడుతూవుండగా, శ్రీకృష్ణుడు ఫక్కున నవ్వాడు: "నీలే! నీవు సముద్రంలోని ఉప్పుని తినావని" అన్నాడు. నీల బిత్తరపోయింది.

ఈ సంభావనతో, ఈ చమత్కారంతో గోపికలకు ధైర్యం వచ్చింది. వారి నిర్వేదం కొంత ఉపశమించింది. శ్రీకృష్ణుడు తమయందు అనురక్తుడేనని వారు అనుకున్నారు. మనస్సులో అందుకు వారు నీలను అభినందించారు. పైకి తమ మనస్సులను విప్పి, ఇట్లా అన్నారు: "కితవుడా! నీల చెప్పినమాటలు విన్నావుగదా! అత్తలను, మామలను, అల్లులను, తండ్రులను, భర్తలను, భ్రాతలను వదలి ఎందుకు వచ్చారు? అని ప్రశ్నిస్తున్నావు. ఆ ప్రశ్న వేయడం నీకు తగునా! మేము ఎందుకు వచ్చింది నీకు తెలియదా! మేము చెబుతున్నాము విను. నీ చక్కని నవ్వులు చూచివచ్చాము. నీ మెత్తని మాటలను మరిగివచ్చాము. నువ్వు అసలు ఆ వేణువును ఎందుకు ప్రయోగించావు? ఆ ధ్వని విన్నంత మాత్రంచేత సర్వప్రకృతి

పశ్యోభయం త భుజయంత యుగం విలోక్య
పత్స్త్రీ ర్ఘక పతులాంత భవాముదాస్యః

అంటూ పారవశ్యంతో మధుర ప్రలాపం సాగిస్తున్నారు. భగవంతుడు వారియందు అర్ద్రీభూతుడౌతున్నాడు. వారి దీనాలాపాలు అంకించి ఓపికలు తక్కిన గోపికలకు అభయం ఇస్తున్నట్లు దక్షిణకరం ఎత్తి వారిని తోరడించడానికి సముద్యతుడౌతున్నాడు. అది చూచి గోపికలు ఆ పారవశ్యంతోనే ఆత్మారాముణ్ణి,

కట్టా! తల ముసుకలంతై
పటువు విరహోద్ది తెరలు తిరలుా తేకసే
పెటుసే పరి చేర్పవయా
కట్టడివికదా! కుమార కరుణోదారా!"

అంటూ మధురంగా, ప్రియంగా ఉపాలంభించారు. స్వామి తిరిగి వేణువు ప్రమోయించాడు. వడివేసగిలో వర్షం కురిసినట్లు వుంది ఆ గాంధర్వం. అది చెవులకు సోకగా గోపికలలో ప్రశ్న దవులు ఇక మారుతున్నాయి. వారిలో మధురభావం స్థాయిని అందుకుంటున్నది. నీలలో 'నేను ఎవ్వరుకను?' అన్న ప్రశ్న వినికిస్తున్నది. తిరిగి అది మనస్సులో స్వామిని "స్వామి! నేను ఎవ్వరుకను? నేను ఏమవుతాను?" అని ప్రశ్నించింది. స్వామి వేణువులో అఖామ గాంధర్వం వెల్లువ లౌతున్నది. గోపికలు పరవశలై సముద్రతరంగాలను పోలి స్వామిమీదకు పొంగుతున్నారు, నీల మనస్సులో అన్యవి భ్రమరధ్వనినిపోలి కదలాడింది. ఆ వేణువు తనలో భ్రమరమై మెదులుతున్నది అనుకున్నది నీల. తన మనస్సు ఒక కీటకంగ ఈ భ్రమరం ఇట్లా మోత్రమోగుతూ, నాలో తిరిగి తిరిగి నామనస్సును ఏమిచేస్తుంది? అనుకుంది నీల. శ్రీకృష్ణదేవుని వక్త్రారవింద శ్వసనమధుర సజ్జమైన మురళి శ్రుతినాదాలను ఊదుతోంది. అందులోంచి అద్భుతాలు బాహిరిల్లుతున్నాయి. ఇప్పుడు అక్కడ నీలకు ఒక్క కృష్ణుడుకాదు; బహుమంది కృష్ణుని మూర్తులు కన్పిస్తున్నారు. గోపికలు ఆ మూర్తులమీదకు ఎగబడుతున్నారు. ఇంతమంది కృష్ణులలో అసలు కృష్ణుడు ఎవ్వరు? ఆ కృష్ణుడు ఎక్కడవున్నాడు? "స్వామి! నీవు అక్కడ?" అని నీల బిగ్గరగా పృచ్ఛించింది. ఆ ప్రశ్న విన్నవారు అప్పుడు అక్కడ ఎవ్వరు? పట్టించుకున్నవారు ఎవ్వరు? అప్పుడు అక్కడకరుణాలో కనములు; పటాంచల కచాకర్షణములు! మేఖలాకర వాహాప్రస మర్దనములు; నఖాంకవ్యాప్తులు; పర్మవాక్సరి రంభణములు; మంజులాధర సుధాపానములు; లీలామానుష విగ్రహుడు, మాయావి, కృష్ణుడు ఆత్మారాముడే వ్రజసుందరీ బృందాన్ని కరగించివేస్తున్నాడు. శ్రీకృష్ణుడు చంద్రుడైతే, ఆ గోపికలు ఉత్పుల్ల కల్హారాలై విప్పుమిరులున్నారు. శ్రీకృష్ణుడు చంద్రుడైతే, గోపికలు నక్షత్రాలై అతణ్ణి పరివేష్టించి కొలుస్తున్నారు. ఒక్కడే అయిన చంద్రుడు నదు నదీపులకు తాను ఒక్కొక్కడై తోస్తున్న రీతిగా, గోపికాజనానికి, ఒక్కడే కృష్ణుడు ఒక్కొక్కడై తోస్తున్నాడు. ఆ గోపికలు ఆ కృష్ణుణ్ణిగూర్చి పాడుతున్నారు. ఆ కృష్ణుడు ఏ గోపికకు ఆ గోపికకు ఒక్కొక్కడై తోస్తూ వారి పాటకు అనుగుణంగా ఆడుతున్నాడు. ఆ ఆటలలో వారికి ఇది వనం, ఇది యమున, ఇవి ఇసుకలు, అని పట్టలేదు. ఆ యమునకు మాత్రం వారిసంగతి పట్టింది. ఆ యమున వారి విహారంకోసం శీతమవాలుకమైన పులినాన్ని పరచింది. కుముదాలు విచ్చింది. అంభోజాలు విరిసింది. సువాసనాలహారిగా మందవాయువులు వీచింది. నీల వారి వెనుకనే యమునఒడ్డుకు వచ్చింది. ఆమెకు అప్పుడు అక్కడ ఏమి జరిగిందో తెలియరానంత ఇంగా అంతా జరిగిపోయింది. ఏగోపికకు ఆగోపికయే కృష్ణుడు తనకు చిక్కాడంటే, తనకే చిక్కాడనుకొని, చొక్కి, మక్కువతో తన్నుతానే ఎక్కువ చేసుకుంది. ప్రతి ఒక్క గోపికలోను సాభగమైన మదం పొచ్చిపోయింది. ప్రతి గోపిక కామవాతియేగాని, అకామవాత కాలేదు. ఎవరికి వారు తామ కృతార్థులం అయిపోయినామంటే తామ కృతార్థులం అయిపోయినా మనుకున్నారు. వారిలో అభిమానం కమించలేదు అనుకున్నాడు కృష్ణుడు. అనుకొని తిరోహితుడైనాడు. గోపికలకు ఇంకా చొక్కు తగ్గలేదు. నీలకు ఇది అంతా ఇంద్రజాలాన్ని పోలి వుంది. గోపికలు ఆ ఇంద్రజాలంలోంచి మేల్కొనడంలేదు. మేల్కొనక కృష్ణుడు కన్పించక తికమకపడ్డారు. ఏ గోపికకు ఆ గోపికగా తికమకపడ్డారు. అంతా తికమక పడ్డారు. వాడు ఎప్పుడు ఏమిచేసి మాయమైనాడో వారికి తెలియలేదు. వారు తల్లడిల్లిపోయినారు. అన్నిదిక్కులు కలచూచారు, ఎక్కడా కృష్ణుడు కన్పించలేదు, నీవు ఏమిచేశావంటే, నీవు ఏమి చేశావని ఒకరిని ఒకరు ప్రశ్నించుకున్నారు. ఎవరు ఏమీ చేయలేదని తెలిసి తెగ్గడిల్లారు. బిగ్గరగా దురపిల్లారు. నీలనుచూచి "నీలే! ఈ కృష్ణుడు ఏమైనాడు?" అని ప్రశ్నించారు. "నాకు ఎట్లా తెలుస్తుంది?" అంది నీల. "ఏమి! నీవు కృష్ణునితో ఆడుకోలేదా? ఆడుకోకుండా ఎట్లా వుంటావు? ఆ కృష్ణుడికి నీవంటే యెక్కువ ప్రేమ. ఇప్పుడు నీవు అతణ్ణి మాకుకాకుండా ఎక్కడో దాచావు. ఎక్కడ దాచావు? ఏమి చేశావు?" అంటూ ఒక గోపిక కోపం చూపించింది. ఒంకో గోపిక ప్రతిమలాడింది: "నీమీద మాకు కోపం ఏమిటి? నువ్వ లేకపోతే ఆ కృష్ణుడు మాకు దక్కడా? రా! ఆ కృష్ణుణ్ణి చూపించు. నీకు పుణ్యం వుంటుంది. నన్ను చంపకు" అంది. ఇది నా కృష్ణ డంటుం దేమనుకున్నారు తక్కిన గోపికలు. ఎవరికివారు నా కృష్ణుడు, నీ కృష్ణ డేమిటని ప్రశించుకున్నారు. అప్పుడు వారిలో మాయ కొద్దిగా విడలింది. ఆ మాయ వాని టక్కులు అర్థం తెలిసింది. అంతా అప్పుడు నీలను "నీలే! స్వామిని నీవు నీలో దాచుకోలేదుగదా!" అని ప్రశ్నించారు. "నాలో ఎట్లా దాచుకుంటాను?" అనుకుంది నీల. నీలకు వారిసంగతి అర్థమైంది. వారికి ఒకటి తెలిసి ఒకటి తెలియడంలేదు. శ్రీకృష్ణుని మాయామోహితుల వారు ఒకరిని ఒకరు ఎరుగలేకపోతున్నారు. నిర్వేదంలో ఉన్మాదాన్ని భజిస్తున్నారు. కృష్ణుడు కన్పిస్తేనేగాని స్వాధీనంలోకి రారు.

నీల అన్నది: సఖిములారా! ఈ కృష్ణుడు వట్టి మాయలాడు. ఆయన అందరి కనుమొరగిపోయినాడు. ఏమైనాడో, యెక్కడికి పోయినాడో, యెక్కడ దాక్కున్నాడో వెతుకుదాము రండి! ★

డాక్టరు సూదితో కి మందుఎక్కించి రోగిని పరీక్షించాడు. రోగి మెలికలు తిరిగిపోయాడు.

డాక్టరు: నేనింకా ఇంజెక్షన్ ఇవ్వకుండానే గాబరా పడతారేమిటండీ.

రోగి: అది కాదు. మీరుబూటుతో కాలు తొక్కుతున్నారు.

* * *

డాక్టరు: 'ఆ' అనండి.

రోగి: జ్వరం నయమైందండి; బిల్లు చెల్లించటానికి వచ్చాను.

డాక్టరు: ఆ............

# రాబిన్ హుడ్

ఓ రోజున పొద్దుగూకేవేళ రాబిన్ హుడ్ తన జట్టునంతా ఒక్క చోట చేర్చి ఏవేవో కబుర్లు చెప్పటం మొదలెట్టాడు. చిమ్మచీకట్లు మెల్లిగా చుట్టూ ఆకట్టుకుంటున్నాయి. అడివంతా మత్తుగా ఉంది.

అప్పుడు అక్కడికి ఎవరో గుర్రం మీద దడదడా పరిగెకుంటూ రొప్పుకుంటూ వచ్చాడు. రాగానే ధడాల్న గుర్రంమీంచి దిగి నరాసరి రాబిన్ హుడ్ దగ్గరకి వచ్చి 'శరణు' అన్నాడు. "రాబిన్! నేన్నీకు కొత్తవాణ్ణి కాను. ఇప్పుడు నువ్వు నన్ను కాపాడలి. లేకపోతే నేను ఇక బతకను" అన్నాడు.

కొత్తవాణ్ణి కానంటున్న ఈ పాతవాడెవరో రాబిన్ కి అర్థం కాలేదు. చిమ్మచీకట్లో మొహం కూడా కనిపించలేదు.

'ఇంతకూ ఎవర్ నువ్వు? ఏమిటి నీకొచ్చిన చిక్కు?' అన్నాడు రాబిన్.

ఆ మనిషి కాస్సేపు కిమ్మనలేదు. అటు తర్వాత ఇలా చెప్పాడు:

"రాబిన్! నేను ఎవర్నో చెబితే వాకిక్కడ మంచినీళ్లు కూడా పుట్టవని నాకు తెలుసు. అయినా చెబుతున్నాను! శరణు వేడినవాడు శత్రువైనా మిత్రుడైనా కాపాడగల ధీరుడవని నాకు తెలుసు. అందుకే నీముందుకు వచ్చాను. చూడు మిత్రమా, నేనెవర్నో కాదు - నిన్నటివరకు నీ మీద పగ సాధించి వేధించి బాధించిన నాటింగిహాం షెరీఫ్ ని. నిన్ను పట్టలేని నా అప్రయోజకత్వానికి వళ్లు భగ్గున మండి నన్ను కాస్తా కిందికి దించారు. బంగళాలు, పొలాలూ అన్నీ లాక్కున్నారు. ఛో పొమ్మన్నారు. చచ్చి చెడి బతుకుజీవుడా అని పరగణాలో ఓమూలపడుండి కాలక్షేపం చేశాను. కానీ నా ఆస్తీపాస్తీ అన్నీ కొత్తగా చెలరేగిన బందిపోటు ముఠాలు దోచేసుకున్నాయి. చిల్లిగవ్వకూడా లేనిస్థితిలో యిక్కడికి వచ్చిపడ్డాను" అన్నాడు.

రాబిన్ హుడ్ తనజట్టుతో సహా ఆశ్చర్యంలో ఒక్కసారి పడిపోయాడు.

"సరే యింతకీ ఆదొంగలెవరు?"




అన్నాడు. "అదే గుట్టు! ఎవరో తెలీదు చూస్తే అధికారుల ఆనరాతోనే అన్నీ సాగుతున్నాయనిపిస్తోంది." అన్నాడు మాజీ షెరీఫ్.

అయితే దేశంలో అంతా అరాచకంగా తయారయిందన్నమాట. ఆలనాపాలనా లేక దేశం దేశం అఘోరిస్తోంది. అంతేగా, ఇదేదో తేల్చుకోవాలి. ఈ బందిపోట్ల ఇబ్బందిపోట్ల నుంచి ప్రజలను రక్షించాలి - బందిపోట్లని బందీలుగా చేసి శిక్షించాలి." అన్నాడు రాబిన్ హుడ్ పట్టుదలగా.

ఉన్నట్టుండి లిటిల్ జాన్ ఇంతలో "అందుకు ముందుగా ఈ మాజీ షెరీఫ్ తాటవల్చి పారేయాలి. బందిపోట్లకు బంధువై, చట్టానికి చుట్టమై మంచిని ఈ చుట్టుపట్ల మట్టుపెట్టిన ఈపెద్దమనిషి తోలుతో తాషామర్పాలు కట్టి బజాయించాలి" అంటూ బిగ్గరగా అరిచాడు.

"అయితే అంతకన్నా కూడా ముందు మరోపని చేయాలి జాన్! 'ఈ రాబిన్ హుడ్ ను నీ బాణంతో నిలువునా కూల్చివేయాలి. నీ బాణం నా ప్రాణం తీల్చిపారేసినప్పుడే ఆపని జరగటానికి వీలు. అంతవరకు శత్రువైనా సరే — శరణంటే ప్రాణానికి ప్రాణం యివ్వటం ఒక్కటే మాజల్నా. ఆలోచించు" అన్నాడు రాబిన్ హుడ్.

లిటిల్ జాన్ ఊర్కోలేదు. "మరీ అంతమంచితనం పనికిరాదు దొరా! మంచికయినా మితం ఉండాలి — మితం లేకపోతే ఖతం అయిపోతాం." అన్నాడు.

రాబిన్ హుడ్ నిశ్శబ్దంగా నవ్వాడు.

"పిచ్చివాడా, మంచికి మితం దేనికి? అతిమంచి మనం చేయనే చేయంగా? ఈ షెరిఫ్ అధికారంలో కారంగా ఉన్నప్పుడే మనం విడిచిపెట్టాం. ఇప్పుడు చెయ్యి చేసుకుంటే చచ్చిన పామును చంపటమే. అంతపాడు పని ఇక్కడ ఇంత పిల్లాడుకూడా చెయ్యడు. చేస్తాడంటావా?" అని బాణంలా సూటిగా చూపుడు వేలు సారించి అడిగాడు రాబిన్.

లిటిల్ జాన్ గటాగ్గా నిశ్శబ్దంగా ఉండిపోయాడు.

"చూడు జాన్. ఇప్పుడిహ మనం ఘనకార్యం ఒకటి చెయ్యాలి. ఆలస్యం పనికిరాదు. రేపటిదాకా యెందుకు? ఏ పనైనా అనుకుంటే వెంటనే జరిగిపోవాలి. రేపటికి వాయిదా సుతరామూ పనికిరాదు. అందుకని ఈ మనకలోనే మనం కార్యం సాధించాలి" అంటూ మాజీ షెరీఫ్ వైపు చూశాడు.

"నిజంనిజం డెర్బీషైర్ పర్గణా అంచున వెన్నెలవాగుదాపున పాడుపడ్డ పాతకోటలో భూసారంగాల్లో ఈ దొంగలు కాపురం ఉంటున్నారని తెలిసింది. వాళ్లు రాత్రిళ్లు ఇళ్లు దోచుకోడానికి పోతారు. ఈ సొరంగాల్లో సొమ్ములు దాచుకుంటారు. ఆ ఒడుపుచూసి మనం అదికాజేస్తే సరిపోతుంది" అన్నాడు పాతషెరీఫ్. ఆ మాటలమీదుగా రాబిన్ జట్టంతా చకాచకా నడిచి వెళ్లిపోయారు.

# సీతాఫలం కథ

దండకారణ్యంబు నందున
దాశరథి వసియించుచుండెను,
భార్యసీతయు, భ్రాతలక్ష్మణు
భక్తితో సేవించుచుండగ.

ఒక్కరోజున నడచి నడచీ
చిక్కులెన్నో గడచి గడచీ
త్రోవ తెలియని అడవియందున
త్రోవ చేసుక పోవుచుండగ.

నడచి నడచీ సీత యిక తా
నడువజాలక నిలచిపోయెను.
ఆకులతో లక్ష్మణుడు కట్టెను
అందమగు నొక పర్ణశాలను.

అంత తమ్ముని బిలిచి రాముడు
అనియె నాతని తోడ నిట్టుల:
"పాప మాకలిగొనెను జానకి,
ఫలము లేవో తెమ్ము తినుటకు."

శీఘ్రమే శ్రీరాము నాజ్ఞను
శిరమునంగొని వెడలె నాతడు,
కడుభయంకరమైన కానలో
కానరావు భుజించు ఫలములు.

వెదకి వెదకీ విసిగి పోయీ
వెనుక తిరిగీ వచ్చుచుండగ
కొన్ని కోసులు ఫలము లేవో
కొరికి తినగా చూచె నాతడు.

వింతపడి యొక పండు తీసుక
విరచి నోటను పెట్టగా,
తీయగా నుండుటను తెలిసీ
కోయసాగెను కొన్నిటిన్.

కొన్నిఫలములు కోసి, వడలీ,
అన్నగారికి యివ్వగా,
అతడప్పుడు సతిని జూచీ
"సీత! ఫలములు తీసి" కొమ్మనె

"సీత ఫలములు తీసికో" అని
శ్రీరాము డనెనని తలచుచు
సీతఫలములు వానిపేరని
సీతగట్టిగ నమ్మెను.

నాటినుండీ నేటి వరకూ
వాటికా పేరు స్థిరపడె,
సీతఫలముల పేరు నాడూ
సీత పెట్టినదే గదా.

## "రాజబాబు"

ఆ సొరంగం దగ్గర కొందరు బందిపోట్లు దిట్టంగా తాగి మత్తుగా కాపలా ఉన్నారు. ముంకువగా కూర్చుని కళ్లు తెలీకుండా నిద్రపోతున్నారు. తెరుచుకున్న కళ్లు తేలవేసి కూలబడి ఉన్నారు.

రాబిన్ జట్టు వాళ్లమీదుగా వెళ్లింది. వాళ్లు ఈ లోకంలోకి వచ్చిపడి మెత్తగా తన్నులు తిన్నారు. మత్తుకాస్తా వదిలిపోయి వాళ్లు సొరంగాల్లోకి వెళ్లి చూస్తే అంతా చీకటి! మన్ను — మశానం తప్ప బంగారం లేదు. గుండెలు బాదుకున్నారు... గాభరాపడ్డారు.

"ముతావస్తే చస్తాం, పోయిన సొమ్ముకు బదులు మన్ని పూడ్చిపెడతారీ సొరంగాల్లో." అని భయపడి పలాయనం చిత్తగించారు.

రాబిన్ హుడ్‌కి కొన్ని వేల పౌన్ల సొమ్ము దొరికింది. బాగా ఆలోచించాడు. మర్నాడు రాజప్రతినిధిగా ఉన్న జాన్ ప్రభువుకు ఈ సొమ్మంతా తీసుకువెళ్లి అప్పగించాడు.

"మహారాజా బందిపోట్లు చెలరేగి పరగణాలన్నీ పాడుపడయిపోతున్నాయి. డెర్బీషైర్‌లో చూశారా. ఈ పరగణాడు సొమ్మూ బందిపోట్లు కాజేశారు. ఎవరిది వారికి

→

# చందమామలో కుందేలు

★ పైడి ★

మీరందరూ చందమామను చూస్తూనే ఉంటారు. అందులో ఓ కుందేలు కనిపిస్తుంది కదూ! అది అక్కడకు ఎలావచ్చిందో తెలుసా? చెప్తా వినండి.

అనగనగా భూలోకంలో ఓ తల్లి కుందేలు, పిల్లకుందేలు వుండేవారు కుందేలు పిల్ల పేరు ‘కన్న’.

ఒకసారి దిగాలుపడి ఇంటికొచ్చిన పిల్లను గుమ్మంలోనే చూసి ప్రేమతో తల్లి అడిగింది. “ఏంకన్నా ఇవాళ నువ్వు విచారంగా వున్నావు? ఆటలో ఎవరైనా ఏమైనా చేశారా?” అని.

“మరే అమ్మా ఇవాళ వాళ్ళ బుజ్జి నాన్నే వాడికి ఎన్నో రకరకాల, రంగు రంగుల బొమ్మలు, మిఠాయిలు తీసుకొచ్చాడమ్మా. ఆ బొమ్మలు ఎంచక్కా వున్నాయనుకొన్నావు! నాకెవరూ అలా తీసుకొచ్చి ఇవ్వరేమే అమ్మా. ఇంతకీ మానాన్న ఎక్కడి కెళ్లాడే ఎప్పుడూ కనిపించడు.”

కాస్త కాసగా వికసిస్తున్న కన్న బుద్ధికి నాన్న లేనిలోటు కనిపించింది. కానీ కన్నీళ్ళు పెట్టుకోవడం తప్ప తల్లి ఏమని సమాధానం చెబుతుంది.

“మీ నాన్న నువ్వు పుట్టిన కొద్దిరోజులకే పోయారు బాబూ!” అంది తల్లి చీరచెంగుతో కళ్ళు తుడుచుకొంటూ, తన దుఃఖం చూసి పసివాడుకూడ బాధపడ్తాడేమో నని.

“ఎక్కడికి పోయాడమ్మా నాన్న?”

“అదో పైకి” అని వేలెత్తి ఆకాశంవైపు చూసింది. కన్న ఆకాశంవైపు చూశాడు. అక్కడక్కడా చుక్కలు మిల మిల్లాడుతున్నాయి. చందమామ, నక్షత్రాలు మేఘాల చాటున దాగుడు మూతలాడుకొంటున్నారు.

“ఏమ్మా నాన్న నామీద కోపం వచ్చి అక్కడికి వెళ్ళిపోయాడా?” అని అడిగింది కుందేలు పిల్ల మరలా.

కొడుకు అమాయకంగా వేసిన ప్రశ్న తల్లిహృదయాన్ని బాణంలా తాకింది. “కన్న పుట్టుక వాడి తండ్రి చావుకు కారణమైంది. అని ఇరుగు పొరుగు ఇదివరకు అంటూండేవారు. భర్తపోయిన విచారంలో ఆమాట నిజమే ననుకొనేది తల్లికుందేలు.

“లేదుకన్నా. మీ నాన్నకు ఎవరిమీదా కోపం లేదు...” అని ఓదారుస్తూ కన్నని దగ్గఱకు తీసుకొని హృదయానికి హత్తుకుంది. అమ్మ వెచ్చనికౌగిల్లో ఒరిగిపోయి తన బాధంతా తాత్కాలికంగా మర్చిపోయిం కుందేటిపిల్ల కన్న.

కాని కుందేటి పిల్ల కన్నకు తండ్రిని చూడాలన్న కుతూహలం ఎక్కువవుతోంది. అమ్మనడిగితే వేలెత్తి చంద్రలోకాన్ని చూపించి “నాన్న అక్కడున్నార”ని చెప్పింది. ఎలాగైనా నాన్నదగ్గఱకు వెళ్ళి, కలుసుకొని వెంటబెట్టుకు తీసుకొని రావాలని నిశ్చయించుకొంది కుందేలుపిల్ల. అప్పుడుగాని తన నేస్తగాళ్ళ కిక్కురుమనరు. వాళ్ళ నాన్నలకంటే మా నాన్నే ఎంతో మంచివాడని వాళ్ళకు నిరూపించాలి.

అమ్మ పక్కలో పడుకొని పుచ్చపువ్వల్లా వెన్నెలను వెదజల్లే చందమామను చూస్తుండేది ప్రతిరాత్రి. తననిచూసి నవ్వుతూ “నాదగ్గరకు రా, మనిద్దరం ఆడుకుందాం” అని పిలుస్తున్నట్లుగా వుంది. పైగా “ఇదుగో! మీ నాన్న ఈ లోకంలోనే వున్నాడు.” అని కూడ చెబుతున్నట్లుండేది.

నాన్నదగ్గఱకు వెళ్తానని చెప్తే అమ్మ పోనీయదు. ఒంటరి దాన్ని చేసి వెళ్ళిపోతావా కన్నా! అని కన్నీళ్లు పెట్టుకొంది ఒకసారి. అమ్మ ఏడిస్తే తనుచూడలేడు. ఏడుస్తున్న అమ్మను విడిచి తను నాన్నకోసం వెళ్లలేడు. కానీ నాన్న లేకపోతే

---

యిప్పించండి. బందిపోట్లను మట్టుపెట్టండి” అని వేడుకున్నాడు.

జాన్ కడుపునిండా ఆనందించాడు.

“రాబిన్ – ఇదంతా పరగణా సొమ్ము కాదు. నీ మంచితనం! నీ మంచితనం అందరికీ నేను పంచిపెడతాను. కానీ నీ అంబులపొదిలో బాణాలు తీసి బందిపోట్లకు నీవు పంచిపెట్టాలి. బాణానికి బందిపోటు ప్రాణం పోవాలి. ఆ పని నీ వంతు”అన్నాడు.

వంగి దణ్ణం పెట్టి ఠీవిగా షెర్‌వుడ్‌లోకి నడిచాడు రాబిన్‌హుడ్!

(సశేషం)

తనకి ఆనందమే లేదు. స్నేహితులు తనని ఎగతాళి చెయ్యటం మానరు. అందువల్ల అమ్మకు తెలియకుండా ఇంట్లోంచి వెళ్ళిపోవాలి. నాన్నను తీసుకు రాకుండా ఇంటికి తిరిగి రాకూడదని తనమీద తనే ఒట్టు పెట్టుకొని ఒకరోజు రాత్రి ఇల్లు విడిచి చంద్రలోకానికి బయలు దేరాడు కన్న.

చాలాదూరం నడిచి, నడిచి అలసిపోయి ఓ సెలయేటిలో కాసిని మంచినీళ్ళు తాగి ఒడ్డున సేదదీర్చుకొంటోంది కుందేలుపిల్ల కన్న. అడవి దారుల వెంట నడవటంవల్ల కన్న బుల్లిబుల్లి పాదాల్లో ముళ్ళు గుచ్చుకుని బాధపెడ్తున్నాయి. అసలే ఎర్రగా వుండే ఆ పాదాలు కంది పోయి మరీ ఎర్రగా అయిపోయాయి. చంద్రలోకం ఇంకెంతదూరమో! దారి ఎటో! తనకి ఇక నడిచే ఓపిక లేదు. అడుగుముందుకు పడటం లేదు. ఇల్లు, ప్రియమైన అమ్మను విడిచివచ్చి దారిలో చిక్కడిన తన నిస్సహాయతకు ఏడుపు వచ్చింది కన్నకు

ఆ దారినే ఎగురుతూ పోతున్న ఓ చకోరపక్షి కుందేలుపిల్ల అవస్థను కనిపెట్టి, జాలిపడి క్రిందికి వచ్చి వాలింది.

"ఏం అబ్బాయి నీ పేరేమిటి? ఎందుకు ఏడుస్తున్నావు?" అని అడిగింది ఆ చకోరి.

"నా పేరుకన్న. మా నాన్నను చూద్దామని చందమామ దగ్గరకు పోతున్నాను. దారి తెలియక, అలసి పోయి నడవలేక ఇక్కడ చిక్కడి పోయాను." అంది జాలిగొల్పే చూపులతో.

"చంద్రలోకం ఇక్కడకి చాలా దూరం వుంది. కావలిస్తే నా వీపు మీద ఎక్కికూర్చో. అక్కడ దిగ బెడతా. నేను కూడ ఆహారంకోసం అక్కడికే పోతున్నా. చంద్రుడు విసిరే వెన్నెలరేకులే మా ఆహారం" అని అంది చకోరి.

చకోరి మాటలు విన్న కన్న ముఖంలో సంతోషం పున్నమ వెన్నెలలా విరియబూసింది. వగేయని దాని వీపుమీద ఎక్కి గట్టిగా పట్టుకొని కూర్చుంది. చకోరి ఆకాశంలో పైకి, పైపైకి మబ్బులను బాణంలా దూసుకొంటూ ఎగురుతోంది. కళ్ళు తిరిగి పడిపోతానేమో ననిపించింది కుందేలుపిల్లకు. కానీ ఎట్లా అయితేనేం చంద్రలోకం చేరారు. చంద్రుని రాజనగరంలో కన్నని వదిలిపెట్టి చకోరి తన పని మీద వెళ్ళిపోయింది.

దోవలో కనిపించిన ప్రతివాడ్నీ "మానాన్న నెక్కడైనా చూశారా" అని అడుగుతుంది.

"ఎలావుంటాడు మీ నాన్న?" అని ప్రశ్నించేవాళ్ళు ఏదో గుర్తుకి తెచ్చుకుంటున్నట్లుగా ఆలోచిస్తూ.

"నేను అచ్చం మా నాన్న పోలికేనని మా అమ్మ చెప్పేది" అంది.

"ఏమో నేనెప్పుడూ చూళ్ళేదు ఇంకా పైకి వెళ్ళి అడుగు" అని వాళ్ళదోవన వాళ్ళు పోయేవారు. ఎన్నోవీధులు, సందులు, గొందులూ తిరిగింది. ఎవ్వరూ వాళ్ళ నాన్న సంగతే చెప్పలేదు. చివరికి ఎవరో దయాశాలి "అక్కడే చంద్రుడు వుంటాడు. అతన్ని వెళ్ళి అడిగితే తెలుస్తుంది" అని చంద్రభవనానికి దారిచూపాడు.

భవనంలోపల అడుగుపెట్టే టప్పటికి ఎదురుగ్గా ఎవరో పిల్లవాడు ఆడుకుంటున్నాడు. ఆ అబ్బాయి ముఖం ఎంతో గుండ్రంగా చూడ ముచ్చటగావుంది. కుందేలు పిల్లను చూసి చిరునవ్వు నవ్వాడబ్బాయి.

"నువ్వెవరు?" అని అడిగింది కన్న.

"నేను చంద్రుడ్ని." రోజూ తనని దగ్గరకు రమ్మని పిలిచే చంద్రుడ్ని అప్పుడు గుర్తుపట్టింది కన్న.

"మరి నీ పేరో?" అని అడిగాడు చంద్రుడు.

"కన్న"

"అయితే నా సాయం వుంటావా? మనిద్దరం కలిసి ఆడుకోవచ్చు" అన్నాడు చంద్రుడు.

"వుంటాగానీ, మరి మానాన్న ఎక్కడున్నాడో చూపిస్తావా?" అంది కన్న.

"మీ నాన్న ఈ లోకంలోకి రాలేదు. బహుశా భూలోకంలోనే వుంటాడు. అందుకని ఒకపని చేద్దాం. రోజూ రాత్రిళ్ళు నేను ఎక్కి ఆకాశంలో తిరిగే రథంలో నా ఒళ్ళో నిన్ను కూర్చోపెట్టుకుంటాను. నువ్వు క్రిందికి చూస్తూ వుండు. లోకమంతా కనిపిస్తుంది. మీ నాన్న ఎక్కడైనా కనబడితే నాతో చెప్పు." అన్నాడు చంద్రుడు. కన్నకి ఈ ఏర్పాటు నచ్చింది. సరే అని ఒప్పుకుంది.

"నువ్వు చెప్పినట్లు చెయ్యకపోతే నీకు 'టూ' కొట్టేస్తా" అని అంది కుందేలుపిల్ల బెదిరిస్తూ.

అలా ప్రతి వెన్నెల రాత్రి చంద్రుని వళ్ళో కూర్చుని కన్న వాళ్ళ నాన్నకోసం వెతుకుతుంది. అలా వెతుకుతూనే వుంది. ఇప్పటి వరకూ చందమామలో మనకు కనబడే కుందేలు కన్నే! ఇంత వరకు వెతుకుతూన్నా వాళ్ళనాన్న కనపడలేదట. మీ కెప్పుడైనా కనిపిస్తే కన్నకు చెప్తారుగదూ! ★


కొద్ది సన్‌లైట్ చాలా బట్టలను ఉతికింది
-అట్లు చేసినట్టిది దాని అధిక నురగ
SUNLIGHT SOAP
Rs. 10,000 Reward!
నాయనమ్మ మెచ్చుకొంటున్నది: అనేక సంవత్సరాల అనుభవంగల నాయనమ్మ సన్‌లైట్ సబ్బుతో లక్ష్మి ఉతికిన బట్టలను చూచి చిరునవ్వుతో మెచ్చుకొంటున్నది. షర్టులు, దుప్పట్లు, తువ్వాళ్లు ఈ బట్టలన్నిటినీ తెల్లగాను కాంతిగాను, ఉతుకుటకు లక్ష్మికి కొద్ది సన్‌లైట్ చాలును సన్‌లైట్ యొక్క సమృద్ధయిన నురగ చాలా బట్టలను బాదకుండానే ఎంతో బాగుగా ఉతుకును. మీ కుటుంబమందరి బట్టలను ఉతుకుటకు సన్‌లైట్ సబ్బును వాడండి.
సన్‌లైట్ సబ్బు బట్టలను తెల్లగాను కాంతిగాను ఉతుకును
హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి ఉత్పత్తి
(S.268-X52 TL

# రాంబాబు పరిశోధన



రాంబాబు పేరు తెలియనివారు పాఠశాల మొత్తము పై ఎవ్వరు లేరు. రాంబాబు వయసున చిన్నవాడైనా బుద్ధియందు పెద్దవాడు. తరగతియందు ఫస్టుమార్కులన్నియు రాంబాబువే. ఇతర విద్యార్థులందరికీ ఇతనంటే అభిమానము. కారణము అందరితో చనువుగా, సరదాగా ఉండడమే.

ఆ రోజు రాంబాబుతరగతివారందరు సంతోషముతో ఉపాధ్యాయుని రాకకొఱకై ఎదురుచూడసాగారు. క్రిందటిరోజు మేస్టారుగారు వారితో పరీక్ష పేపర్లు రేపు ఇచ్చెదనని చెప్పియుండుటయే వారి ఆతురతకు కారణము. మేస్టారుగారు వచ్చి కూర్చున్న తరువాత అందరు కూర్చున్నారు. గోపాల్ లేచి పేపర్లు ఇవ్వండి సార్ అని ఆసక్తితో అడిగాడు. మేస్టారు చిరునవ్వుతో ముందు మార్కులు ఎంటర్ చేసుకుని ఇచ్చెదనని గోపాల్ పెన్ను అడిగిపుచ్చుకుని మార్కులు ఎంటర్ చేసుకుని పెన్ను టేబిల్ పైనుంచి పేపర్లు ఇవ్వటము మొదలుపెట్టారు. అందరు ఆతురతగా పేపర్లు చూచుకుంటు నీకెన్ని మార్కులు, నీకెన్ని మార్కులనుచు గుంపులు గుంపులుగా టేబిల్ చుట్టు చేరి గలభా చేయసాగారు. ఈ అల్లరి అర్ధగంటకుగాని తగ్గలేదు. పేపరు మేస్టారుగారికి తిరిగి ఇచ్చి ఎవ్వరి స్థానములో వారు కూర్చున్న తరువాత గాని తరగతియందు ప్రశాంతి కలుగలేదు గోపాల్ లేచి పెన్ను అడిగాడు అయ్యవారిని. ఆశ్చర్యం! పెన్ను మాయమైంది. మేస్టరుగారి కోపము మిన్నుముట్టింది. తరగతిలో దొంగతనము జరగటము ఇదే మొదటిసారి. మేస్టరుగారు నయానా, భయానా చెప్పి చూశారు, పెన్ను తీసుకొన్నవారు మర్యాదగా తిరిగి ఇవ్వమని తరగతి అంతా నిశ్శబ్దము.

**వై. కృష్ణమూర్తి**

చివరకు మేస్టరుగారు విసిగి క్లాసునందు నమ్మదగిన రాంబాబు సహాయమున అందరిని శోధా చేసినారు. పెన్ను మాత్రము కనపడలేదు. రాంబాబు ఆలోచనలో పడ్డాడు. తరగతి నుండి ఎవ్వరు బయటకు పోలేదు. బయటివారెవరు లోపలికి రాలేదు. తరగతిలోనివారే ఎవ్వరో పెన్నును దొంగిలించి తరగతిలోనే ఎక్కడో వుంచివుంటారు కనుగొనడమెలాగు. తలచాలున రాంబాబు మెదడులో మెఱుపులా మెరిసింది ఒక ఆలోచన. వెంటనే రాంబాబు లేచి "అదిగో పెన్ను కనబడుతూనే ఉంది" అని గట్టిగా అరచి అందరివైపు జాగ్రత్తగా చూడసాగాడు. విద్యార్థులందరు ఎక్కడ! ఎక్కడ అని రాంబాబు వైపు ఆతురతగా చూడసాగారు. గోవిందు మాత్రము భయంతో వెంటిలేటరు వైపు ఒకక్షణము చూచి పెన్ను కనబడలేదని ధీమాతో అందరితోపాటు రాంబాబువైపు చూచాడు. ఇది గమనించిన రాంబాబు పెన్ను తప్పక అక్కడ వుండి వుంటుందని తెలిసియు, వెంటనే చెప్పినచో పెన్ను దాచిన గోవిందు తను దాచినట్లు ఒప్పుకొనడని గ్రహించి ఊరకున్నాడు. అందరు పెన్ను ఎక్కడని అడుగగా ఊరికే తమాషాగా అన్నానని చెప్పాడు.

ఆ రోజు బడివదలు సమయమున ఉపాధ్యాయునితోను, పెన్ను పోగొట్టుకొన్న గోపాలుతోను రాంబాబు "మీరు రహస్యముగా ప్రక్కగదిలోనికి వెళ్లండి" అని రహస్యముగా వారితో చెప్పి తాను వారితో సహా ప్రక్కగదిలోనికి వెళ్ళాడు. మేష్టరుగారు ఎందుకని అడుగగా రాంబాబు "ఇప్పుడు మీకు దొంగను చూపుతాను జాగ్రత్తగా కిటికీ వుండా

# రాంబాబు పరిశోధన

మన తరగతిలోనికి చూడండి" అని చెప్పి తాను చూడసాగాడు. కొద్ది సేపటికి గోవిందు మెల్లగా తరగతిలోనికి ప్రవేశించి వెంటిలేటరు పైనున్న పెన్ను అందుకోబోయాడు. ఇదే సమయమని మేష్టరు, గోపాలు, రాంబాబు గదిలోనికి ప్రవేశించి గోవిందును పట్టుకుని పెన్ను లాక్కున్నాడు.

మరునాటిరోజు తరగతియందు మేష్టరు లేచి రాంబాబుతో తాను దొంగను కనుగొన్న విధము చెప్పమన్నారు. రాంబాబు సగర్వంగా నిలబడి చెప్పసాగాడు. 'నేను పెన్ను పోయినప్పుడే తరగతిలోని వారే దొంగిలించి ఎక్కడో తరగతిలోనే దాచారని అనుకొన్నా. కనుగొనడమెలాగు? చివరకు నాకు ఒక ఆలోచన తోచినది. వెంటనే "అదిగో పెన్ను" అని అన్నాను. నా ఊహ ప్రకారము దొంగిలించినవాడు తప్పక తను దాచిన వైపు భయంగా చూస్తాడు. అదే ప్రకారము గోవిందు వెంటిలేటరు వైపు చూచాడు. నేను అప్పుడే పెన్ను అందరికి చూపించినచో గోవిందు తాను దొంగనని ఒప్పుకొనడు. కావున బడి వదలిన తరువాత వాడు తప్పక వచ్చి దానిని తీసుకొంటాడని ఊహించి అప్పుడే పట్టుకొంటే దొంగ - దొంగిలించిన వస్తువు దొరుకుతాయని నేను, మేష్టరుగారు, గోపాలు పక్కగదిలో పొంచియుండి దొంగను పట్టుకున్నాము." అని ముగించాడు.

విద్యార్థులందరు రాంబాబు బుద్ధికుశలతకు అబ్బురపడ్డారు. హెడ్మాష్టరుగారు "రాంబాబుపరిశోధన" కని బహుమతి అందజేశారు. ★

# నల్లపిల్లి

(16-వ పేజీ తరువాయి)

మొదలు పెట్టారు. ఎక్కడా దొరక లేదు. నా దగ్గరకు వచ్చారు. నా జేబులు తడిమారు. వారు ఖంగారు యెక్కువైంది. నా దగ్గర ఏమీ లేదు. అందరిముఖాలు వాడిపోయాయి. ఈ సారి మా మామయ్యముఖం మరీ కందిపోయింది. పర్సు ఎవ్వరిదగ్గర దొరక లేదు. ఇంతకుముందు ఎవ్వరూ యీ కంపార్టుమెంటులోకి ఎక్కినట్లు లేదు, దిగినట్లు లేదు. ఇంతలో ఓ కానిస్టేబుల్ "ఎవ్వడో. పర్సుకొట్టేసి. బయటకు అందించేసి వుంటాడు సార్!" అని అన్నాడు, ఏదో గొప్ప రహస్యం తెలుసుకొన్నవాడి లాగ. అపబ్లిక్ ప్రాసిక్యూటర్ గారు ఒక వెర్రిగోల. నా కెంతో జాలి వేసింది. ఆ సబ్ ఇన్‌స్పెక్టరు మామయ్యవైపు అదోలాగా చూస్తున్నాడు. వెంటనే మామయ్య "మిస్టర్!.. డోన్ట్ వర్రీ....కమాన్" అని చేతులు కొద్దిగా పైకెత్తాడు. ఆ సబ్ ఇన్‌స్పెక్టరు కొద్దిగా జంకుతూ మామయ్య కోటుజేబులో చెయ్యి పెట్టాడు...అతని కళ్ళల్లో ఏదో మెరిసింది. చటుక్కున జేబులోంచి ఒకపర్సు తీశాడు. అది చూడగానే అతలవ్యక్తి ఒక్కసారిగా ముందుకుదూకి ఆపర్సు పట్టుకుని "ఇదే నాది...ఎంత మోసం?... ఎంతమోసం?? ఏదో పెద్దమనిషి అనుకున్నాను. ఇదా నీవు చేసేది? ఫూల్...రాస్కెల్" అని మామయ్యను తిట్టడం మొదలు పెట్టాడు. నా నెత్తిన పిడుగు పడ్డట్టయింది. అమాంతంగా భూకంపం వచ్చి అందులోకి మేమంతా పోతున్నట్లనిపించింది. మామయ్యముఖం తెల్లబడిపోయింది. చిందులో జీవం లేదు." ఇదంతా మోసం... ఇదంతా మోసం...కుట్ర...పన్నాగం..." యింకా ఏమిటో?...ఏమిటో?...అంటున్నాడు. కాని అవి ఒక ప్రాణంవున్న మనిషి నోట్లోంచి వచ్చినట్లుగా లేవు. నాకు ఎక్కడినుంచో వస్తున్నట్లుగా వినబడుతున్నాయి ఆ మాటలు. "మా మామయ్య దొంగా?...రిటైర్డ్ పోలీసు ఇన్‌స్పెక్టరు ఒకదొంగా??"...నా చెవులు గింగుర్లెత్తిపోతున్నాయ్. "ఆహా...ఎంత పెద్దమనిషి? ఏమి కబురు చెప్పాడండి?... ఇందాకటినుంచి ఒక చేకోతలు...దొంగల్ని పట్టానని... హంతకులను పట్టానని... ఎన్ని?...ఎన్ని కోతలు కోశాడు?...అందుకనే యీ పాపిష్టి కాలం యిలా తయారైంది." అని అంటున్నాడు ఒకడు. ఇలా అంతారు ఏవో ఒకటి అంటున్నారు. నా తల తిరిగిపోతూంది. నా చెవుల్ని, నా కళ్ళని నేనే నమ్మలేక పోతున్నా. మామయ్య నొ తిన నేతులు పెట్టుకొని, నోరు తెరచి, వేళారి తిపోయి అందరివైపు చూస్తున్నాడు. మామయ్యను క్రిందకు దింపారు. ఆ బట్టకల పెద్దమనిషి చిందులు త్రొక్కుతున్నాడు. నేను నిర్లిప్తంగా మామయ్య వెనుకనే సేవనులోనికి వెళ్ళాను. సేవనులో జనం కిటకిట లాడిపోతున్నారు. సబ్-ఇన్‌స్పెక్టర్ గారు కేసు రిజిస్టరు చేసుకొని, ఒకచెయ్యి మీసంమీద వేసి, హాయిగా దువ్వుకుంటూ, రెండో చేయి తన కాకి పేంటు జేబులోకి పోనిచ్చాడు. వెంటనే అదోలాగా మారిపోయాడు. చేయి బయటకు తీస్తే, దానితో పాటు ఒక కాగితం వచ్చింది. దానిని గబగబ చదువుకొని కుర్చీలో కూలబడిపోయాడు. మాకందరికి ఆశ్చర్యం కలిగింది. వెంటనే అతను సర్దుకుని కుర్చీలోంచి లేచి, మామయ్య ముందుకువచ్చి సెల్యూట్ కొట్టి, దిక్కుముఖం పెట్టి "ఎక్స్క్యూజ్ మీ సార్" అని ఆ కాగితం మామయ్య చేతిలో పెట్టాడు. దానిని చదువుకొని మామయ్య అలాగే బల్లపైన కూలబడ్డాడు. నాకేమి అర్థం కావడం లేదు. అక్కడ మూగిన జనమంతా విచిత్రంగా చూస్తున్నారు. మామయ్య చేతిలో ఉత్తరం లాక్కున్నాను. అందులో యిలా వుంది;

శ్రీయుతులైన సబ్ ఇన్‌స్పెక్టరు గార్కి.

నన్ను క్షమించండి మిమ్మల్ని నేను ముందుగానే చూచి మీ కంపార్టుమెంటులో ఎక్కాను. ఈ బుర్రమీసాలాయన తాను ఒక గొప్ప పోలీసు ఆఫీసర్నని, యెంత పెద్ద గజదొంగలనయినా చిటికెలో పట్టుకోగలనని ప్రగల్భాలు పలుకుతున్నాడు. ప్రక్కన కూర్చున్న అసామీ అంతకంటె యెక్కువగా కోతలు కోస్తున్నాడు. వారిద్దరికీ కూడా మంచి గుణపాఠం చెప్పవలెననిపించింది, ఆయన గారి జేబులోంచి పర్సుతీసి ఆ బుర్రమీసాలాయన జేబులో పడవేశాను. బుర్రమీసాలాయన ప్రక్కనే ఓ మతిమరపు కుర్రాడు వున్నాడు. వాని జేబులోంచి పెన్ తీసి యీ వుత్తరం వ్రాసి, మీ పేంటు జేబులో పెట్టాను. ఆ కుర్రాడి పెన్ను మీ కుడి జేబులో వుంటుంది. మీకు చాల శ్రమ యిచ్చాను. ఆ పర్సు ఆ సూటువాలాకు యిచ్చివేయండి. పెన్ను ఆ కుర్రాడికిచ్చివేయండి. ఇకనుండి మీరు మీసాలు దువ్వుకొనడం మానుకోండి. శెలవ్.

ఇట్లు
నల్లపిల్లి.

నా జేబులు తడుముకున్నా. నిజంగా నా పెన్ను లేదు. కథాన్వేషణలో 'నల్లపిల్లి' ఎదురైంది. మరి ఏమవుతుందో? ముందుకు సాగిపోతున్నాను నేను. ★

# ప్రతిమ

(37-వ పేజీ తరువాయి)

నాడు. వినమిత శిరస్కుడైనాడు సుమంత్రుడు భరతునికిప్పుడు ఏవో భయసందేహములు కలిగినవి. "నాయనా! భ్రష్టప్రాయులుగా వున్నారిదేమి జనస్థానమునకు వెళ్ళలేదా? వెళ్ళి నా కోపము చేతనో లజ్జ చేతనో వారు దర్శనమీయలేదా - ఏమిటి మీ చింతా కారణము?" అని ప్రశ్న వేసినాడు. అందుకు సుమంత్రు డిటన్నాడు! నాయనా భరతా స్థిరప్రాంతులు వినీతులు అయిన వారికి కోపము ఎలకలుగును? నా దుఃఖ కారణమది కాదు. నాయనా నేను శూన్యమైన తపోవనమును చూచినాను ఆర్యపుత్రు డుడలేదు. ఎవరూ కానరాలేదు" అని నిట్టూర్చినాడు. "కిష్కింధ అనే వానరనివాసప్రదేశము కలదు కదా అక్కడికి వారు వెళ్ళినారని తెలియవచ్చినది" అన్నాడు అందుకు భరతుడు నిర్విణ్ణుడైనాడు. దుఃఖాక్రాంతుడైనాడు. "నాకు నా గతి మరల చెప్పండి. సంగతి నాకు నివేదించండి. ఆర్యపుత్రుడు తిర్యగ్జాతుల పాలబడిన కారణమేమో తెలియపరచండి" అని వేడికొన్నాడు. "అక్కడ వాలి అనే వానరుడు రాజ్యం చేస్తూ వున్నాడు. తమ్ముడైన సుగ్రీవుని వెడలవేసి ఆలి నపహరించినాడు. కొండలలో కోనలలో గుండెలో కలగుండుతో నున్న తుల్యదుఃఖుడగు సుగ్రీవుని శ్రీరామచంద్రుడు కాపాడినాడు." భరతుడిందుపై "నాయనా సుగ్రీవుడు తుల్యదుఃఖుడంటే అది ఏమో తెలుపగోరుతున్నాను" అని ఆతురుడై ప్రశ్నించాడు. సుమంత్రు డిప్పుడు కించపడినాడు చింతా కారణము దాచ భ్రష్టప్రాయునివలె "నాయనా రాజ్యభ్రంశముచే సుగ్రీవుడు తుల్యదుఃఖునివలె పేర్కొంటిని-అని సమాధానించబోయినాడు. భరతునికది గురూహ్యమైనది, వితర్కించినాడు—విచారించినాడు— "నాయనా మీరేదో రహస్యమును దాచుచున్నారు మీ భ్రష్టప్రాయమును దాచుకొనజాలకున్నారు. స్వామిభక్తుడైన నహోముండలేక్వపై యాన ఈ దాపరిక మిక సాగరాదు. ఆ సత్యమేదో మరుగు పరుపరాదు." ఇందుకు సుమంత్రుడు విషణ్ణుడైనాడు. విలపించినాడు! కన్నీరు నించినాడు—"భరతా మునిజనారణ్యంలో నేను చూచివచ్చిన దొక విషాదగాథ ఆ బాధ నేనిప్పుడు పవయించలేకున్నాను— పూర్వవైరం పురస్కరించుకొని పూర్వదేవుడైన రావణాసురుడు రామచంద్రుని మాయ చేత పాయజేసి సీతమ్మ నపహరించినాడు." అన్నాడు. అశనిపాతమునంటి ఈ మాటకు




"డియర్, ఈ సెంటు వాసన చూడు. బాగుందంటే తీసుకోనా.

బి. వి. సత్యమూర్తి.

ఆంవిరి ద్రుమమువలె భరతుడు కూలిపోయినాడు. మోహాగతుడైనాడు. ఊరకోలీ గతమెల్ల తలపోసి దుఃఖించినాడు. దుర్విధిని నిందించినాడు. ఇప్పుడు సుమంత్రుడు వెంటరా కైకేయి కడకు వెళ్ళినాడు. అమ్మా మునుపటికంటె హెచ్చు ముద్దుగాను వినోదించుటకై నేనిప్పుడు వచ్చినాను. మున్ను సగమే తీరిన నీ మనోరథం నేడు పూర్తిగా ఈడేరినది. ఆత్మ రాజ్యం వరించి ఎవరు నీయానతి చేత అరణ్యం చేరినాడో అతని భార్య సీత ఇప్పుడు అపహృతయైనది. ఆహా! పవిత్రమైన తులగు ఇక్ష్వాకువంశీయులకు కొండలిచ్చే గీవు దాపురించినావు. నిరాశను ప్రతిఫలముగా ఈ కొంత అపహరణ సంకటం కూడా కలిగించి." అని ఛీటూరించినాడు. కైకేయి అమ్మో అని కూయిడపెట్టినది. గుండె నిబ్బరించుకొని సుమంత్రుని చూచి "అయ్యా బిడ్డ నాపై కోపంతో నున్నాడు అతనికి మహారాజులుంగారి శాపవిషయం మీరే ఇప్పుడు తెలియజెప్పాలి." అని వేడికొన్నది. సుమంత్రు డిందుపై ఇట్లన్నాడు: "నాయనా

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## గళ్ళ నుడికట్టు-4

### ఆధారాలు

**అడ్డం**

2 తడిసిన నక్షత్రం

3 రెండు స్వరాలతో అవునని పించుకో వచ్చు.

6 ఎటు చూసినా ఎక్కువే

8 తగలబడి పోతూ అనేసమయం

9. పద్యానికి అర్థం తెలిస్తే రోగానికి మందుగా వస్తుంది.

11. మనిషి కారులో అలా తిరిగి రావటం.

12 కాటుకలో బాధకలిగించేది

13 గోదావరి జలాలలో పండేపంట

14 వీలునామాలో కొంత అవకాశం ఉంది.

15 అతడి పదును

16. చేత

17. వేడి గాలి

20. పాటలు చెల్లాచెదరై ఉత్తరాలు వస్తాయి.

21. గృహ్య ప్రాంగణములో చేరిన సమూహము.

23. దీపావళి చివర ముడత పడింది.

24. రా రా రా రా...ఇవి పడిపోవు

**నిలువు**

1. అరవిరిసిన పుష్పంలో సూర్యుడు బంధించబడ్డాడు.

2. శిల్ప మాయం కావాలంటే ఆ పువ్వు కావాలి.

4. వారికా? మీకా? అల్లరిచిల్లర తనం

5. తాళములో కొంత తీసుకోండి మీరు.

7. సేగుమన్యలో కాసులున్న దేవ.

10 అందుకే! వడివడిగా మోసుకు పోతోంది.

12. మాకాలువరకే! ఇంకా ఎక్కువైతే.

18. ఎటు తిప్పినా వస్తుమే

19. పిల్లా మనుషులే.

20. టపీమని తెరగేసి కూర్చొండి.

22 పెదవులపై ముద్ర.

### 3-వ నుడికట్టుకు జవాబులు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1నా | ■ | 2ఆ | గ్రా | ■ | 3ద | 4గ | ■ | 5ప్ర |
| 6వ | ద | నం | ■ | 7ప | ■ | 8రి | పు | డు |
| ■ | ■ | దం | ■ | సు | ■ | టె | ■ | ■ |
| 9కు | 10శ | ■ | 11అ | ల | లు | ■ | 12కుం | డ |
| ■ | 13కు | రే | ■ | పో | ■ | 14వా | డ | ■ |
| 15శ | ని | ■ | 16మూ | లి | క | ■ | 17లం | క |
| ■ | ■ | 18భ | ■ | గా | ■ | 19మ | ■ | ■ |
| 20అ | న్వ | యం | ■ | డు | ■ | 21కు | లు | 22కు |
| రి | ■ | 23అ | ప్ప | ■ | 24ప | టం | ■ | డి |

## వచ్చే వారం నుడికట్టుకు ఒక కొత్త ఆకర్షణ

# ప్రతిమ

చిరకాల పూర్వం మహారాజులుంగారు ఒకానొక పట్టణంలో కాశీయును ముంచు వ్వవిని వనాజ్యంబుంహిత మనకోసం శబ్ద వేధిగం సంధించి విడిచినారు. వృద్ధులైన తల్లిదండ్రులను సేవించు ముని కుమారుడొకడు చంపబడినాడు. అప్పుడా వృద్ధుడైన ఆ తండ్రి పుత్రశోకాగ్ని ఎంతపుడ్డ మహారాజును నీవు కూడా పుత్రశోకమునే తలచి మరణింతువుగాక అని శపించినాడు. అని వినగానే నాకు అప్పుడా కన్నుల వర్షములు రాలగా కైకేయీ కొని వాయానాధి త నా కై యువరాజము పాపి చిరంజీవి క్రింద ముని అడవులకు పంపి నది అంతిమమైన ఆ నువార్ణి శాపమే. నేను రాజ్యంలో భరంచేత ఈ పని చేయలేను.' అన్నది. పుత్ర వియోగ దుఃఖమునకు తన్నేల పంపరాదు? అని భరతుడు తిరిగి ప్రశ్నించాడు. చిరకాలముగా మేనమామ గారింట నున్న భరతునికి స్వాభావికముగనే విషపా మెర్పడిందన్నది కైక. అయినచో మతి ఎందుకు పోవలెను అని భరతుడడిగినాడు! మా జాగి పదునాలుగు నాళ్ళు అను టకు పగునాలుగేండ్లు అని నోరు తడబడి నదని కైకమ్మ సమాధానించినది. భరతుడప్పుడు కొంచెమాలోచించినాడు. తనిష్ట వానికిగ (గర్భ)తూ దీకి సమ్మతించరని తెలిసికొన్నాడు 'త్రైలోక్య వాక్యులు దీని విరుగు గా. నా అమ్మ విర పరాన. అన్నగారిమీది భక్తి చేత అమ్మను దూషించినాను. ఎంత పాపిని. అమ్మా నన్ను మన్నించు. అని భరతుడు దుఃఖమూలిపోయినాడు కైకేయి తన కుమారుని భావ్యకలితనే తియాలేనని త్రినది. తండ్రి భారాకన్నబిడ్డ తప్పును మన్నించని తల్లి ఉంటుందా! ఇందులోనే తప్పేముం ? అని అనునయించినది భరతుడు తల్లికి అభివాదనము చేసినాడు, అమ్మా నేనిప్పుడే రాజ మండలమంతా సైన్యాన్ని సన్నద్ధపరుస్తాను. ఆర్యపుత్ర విజయానికై ఇదే దైత్ర యాత్ర చేస్తాను' అని కోపానలోజ్వల శోచిర్మయమైన కండ్లోయి కెంతామరలతో భరతుడు పురోగమించినాడు.

(సశేషం)

[illegible]

గుణపదాన్ని ధర్మములు అనే అర్థంలో వాడినప్పుడు ఘనద్రవ్యాలలో కనిపించే విశేషాలు అని చెప్పగలము. గుణాలంటే ధర్మాలు అని పలు రీతిగా వ్యవహరిస్తున్నారు. గుణ అని అంటే [illegible] అన్న మాట.

వీటిలో పైనున్నది శ్రీ విశ్వనాథసత్యనారాయణగారి దస్తూరి. తలకట్లు పొడుగుదేరి ఉండడం ఈ దస్తూరివైలక్షణ్యం...దిగువది శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారిది. శాస్త్రిగారి అక్షరాలు అరవిచ్చిన పూలలా నగంనగంగానే కనిపిస్తూ అక్షరస్ఫోరకంగా కూడా ఉంటాయి.

# దస్తూరి - తీరుతెన్నులు

(11-వ పేజీ చూడండి)

అది సహజంగా ఒక పేరనీ ఖరారుగా చెప్పడానికని సాధారణం ఆ దిగువనే అందులో స్పష్టంగా వ్రాస్తారు.

ఒకసారి, ఒక పెద్దమనిషి మరో పెద్దమనిషికి ఓ కాయితంమీద చేవ్రాలు చూపి "అసలు మీ పేరేమిటో!" తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది "అన్నాడు.

సంతకంచేశాను గా చూడండి అన్నాడా పెద్ద పెద్ద మనిషి. "అదే అదే, అది చూశాకనే కోరిక పుట్టుకొచ్చింది" అన్నాడు చిన్న పెద్ద మనిషి.

* * *

కథలూ, కవిత్వం, వగైరాలూ వ్రాసేవాళ్ళిప్పుడు మన రచయితలకి సంబంధించినంత వరకూ చాలా స్పష్టంగా అందంగా ఉంటుంది. శ్రీయుతులు వేలూరి శివరామ శాస్త్రి, స్వామి శివశంకరులు వ్రాసేదస్తూరిని ముత్యాల సరాలకు ఉపమానంగా చెప్పుకోవచ్చు. విశ్వనాథ సత్యనారాయణ, శ్రీవిశ్వనాథ శిరోమణిగారల లిపికూడా స్పష్టంగా బలంగా ఉంటుంది. మల్లాది రామకృష్ణశాస్త్రిగారి అక్షరాలు, వాక్యాలూ. వాటిలో భావాలూ దానిమ్మ గింజ ల్లా రసభరితంగా ప్రకాశవంతంగా ఉంటాయి. ఈకోవలో పి. గణపతిశాస్త్రిగారి లిపి ఎంతమాత్రం చేరదు. కాపీలు సరిగ్గా రాయని బడుదతరగతి పిల్లల దస్తూరీ పోటీలో పెకందు ప్రయిజు వస్తే ఆశ్చర్యపడ నక్కరలేదు. అంతే. రాతకీ రచనకీ సంబంధం లేదన్న వాదానికిదో ఉదాహరణ.

సినీతార, రచయిత్రి భానుమతీ రామకృష్ణ దస్తూరి, సాధారణంగా ఆడపిల్లల దస్తూరిలా అందంగా తీరుగా గుండ్రంగా ఉండదు. చాలబలంగా విసురుగా ఉంటుంది. స్పష్టంగాకూడా ఉంటుంది. ఈ పైన చెప్పిన దస్తూరీలు అన్నీ నేను స్వయంగా చూశాను.

వీరిగురించి నేనెరిగిన స్వభావాలను వారి దస్తూరీలో చూడాలని ప్రయత్నించగా అన్నిటికీ సమన్వయం కుదరలేదు. మంచి రచయితలైన మరికొందరి వ్రాత కూడా చూశాను. రాత స్పష్టంగా అందంగా ఉన్నంతమాత్రాన రచనకూడా అలాగే ఉంటుందనీ, రాత గజిబిజిగా కోడి కెక్కరించినట్లుగా ఉన్నంతమాత్రాన రచనా అలాగే ఉంటుందనీ అనుకోవడం పొరపాటే నని నాకు అనిపించింది. అయితే, అందువల్ల బాగా రాయగలవాళ్ళు దస్తూరి బాగుండకుండా జాగ్రత్తపడాలని అనుకోను. దస్తూరి స్పష్టంగా కుదురుగా తీరుగా ఉంటే అది ఉత్తరమ్మోక్కు అయినా, అర్జీ అయినా ఫిర్యాదైనా అవతల చదువుకునేవాళ్ళకి చాలా హాయి. చదవాలన్న ఉత్సాహమూ ఉంటుంది. ●

## పిహా దస్తూరి

(8-వ పేజీ తరువాయి)

కూడా జరుగుతోంది.

దూరదేశంలో ఉన్న మిత్రుడొకడు యిక్కడినుండి మామిడిపళ్ళు పంపించమని యెంతో ఆప్యాయతగా వ్రాశాడు తన మిత్రునికి, దూరదేశపు మిత్రుని దస్తూరి అర్థంకాక 'Mangoe (మామిడిపళ్ళు)' అను మాటను 'Monkeys (కోతులు)' అను మాటగా అర్థంచేసుకొని, 'పాపం! ఆయనకు యెందుకు అవసరమొచ్చాయో' అనుకొంటూ ఒక పెట్టెలో కోతులను బుక్కుచేసి పంపించాడట. ఆ దూరదేశపు మిత్రుడు ఆ పెట్టెలోని మామిడిపళ్ళు పంపినందుకు ఎంతో సంతోషపడుతూ ఆ పెట్టె సీల్ బద్దలు కొట్టించి, తలుపులు తెరిచిచూస్తే యింకేముంది! - కోతులు కిచకిచమంటున్నాయి.

దస్తూరి బాగా ఉండడానికి పిల్లలచేత కాపీ (ఒరవడి) వ్రాయిస్తూ ఉంటారు. ★

from a living link

in the sādhanā of both

of our lives.

Very sincerely yours

Rabindranath Tagore

విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ దస్తూరి.



చిత్రకారుడు : డబ్ల్యు. వి. సుబ్బారావు, బందరు.

వుడ్‌హౌస్ కథలో ఒక దరిద్రంపనివాడు హఠాత్తుగా అదృశ్యుడయ్యాడు. కొన్నేళ్ల తరువాత అనుకోకుండా హాలివుడ్‌లో కనబడ్డాడు తన ఊరి వాడికి.

'ఏం చేస్తున్నావిక్కడ?'

"ఆ యేముంది. పిక్చర్లకి స్క్రిప్టు రాస్తున్నాను."

* * *

తన అభిమాన తారను కలుసుకొన్న ఒక పెద్దమనిషి అనీ ఇనీ మాట్లాడక "జీవితంలో ఏనాటికైనా మిమ్మల్ని పెళ్లాడే భాగ్యం అబ్బుతుందని ఆశిస్తున్నాను" అన్నాడు.

"దానికేం భాగ్యం. అలాగే మా సెక్రటరీతో చెప్పిపోండి. నా పెళ్లిళ్ల జాబితాలో పడేస్తాడు మీ పేరుకూడా..." అంది తార.

* * *

నిర్మాత: (డైరెక్టరుతో) వాడెవడండీ ఆ పొట్టివాడు? వాణ్ణెందుకు బుక్ చేశారూ?

డైరె: అయ్యయ్యో. అలా అనకండి. ఆయన్ని నెపోలియన్ వేషానికి తెచ్చాం.

## హాలీవుడ్ హాస్

ప్రొడ్యు: ఇది మరీ ఘోరం. అంత పెద్ద వేషానికి ఇంత పొట్టివాడా?

* * *

"పిక్చరెలా వుంది? సుఖాంతమేనా?

"ఆహా అది అంతమయినందుకంతా సుఖపడ్డారు."

* * *

ఒక పెద్ద హాలివుడ్ నిర్మాత కుమార్తెను బీదవాడి గురించి వ్యాసం రాయమన్నారు బళ్లో. టూకీగా వ్రాసిన ఆ వ్యాసం ఇలా ఉంది:

"బీదవాడు చాలా బీదవాడు. పాపం అతనింట్లో బట్లరు బీదవాడు, పనిమనిషి బీదది. అతని పెద్దకారు డ్రైవరు బీదవాడు. చిన్నకారు డ్రైవరు కూడా బీదవాడే. అతని జవానులందరూ బీదవాళ్లే. వంటవాడు కూడా బీదవాడే."

* * *

ఇద్దరు మిత్రులు ఒక చిత్రం చూసివస్తున్నారు. ఇద్దరిలోనూ ఒకతనికి చాలా నచ్చింది;

"ఎంత బావుందోయ్ పిక్చరు. నిజంగా మన సినిమాలు నానాటికీ ఎంత అభివృద్ధి చెందుతున్నాయో!" అన్నాడు అతడు.

"ఔనౌను. కొత్తల్లో బొమ్మలు కదిలేవి; దరిమిలాను మాట్లాడడం మొదలెట్టాయి. ఇప్పుడిప్పుడు కంపుకొడుతున్నాయి." అన్నాడు అతని మిత్రుడు.

* * *

హాలీవుడ్‌లో గ్రేమురుతారలు చాలామందికి పెళ్లి ఒకహాబీ. ఒకసారి ఒకతార, సెక్రటరీ ఆవిడ రికార్డులలో పొరబాటుచేశాడు. తీరా ఒకనాడా తార తన జీవితచరిత్ర వ్రాయించుకోబోయేవరకు పెళ్లిళ్ల విడాకుల సంఖ్యలో తేడా వచ్చింది. మొత్తం ఆవిడ చేసుకున్న పెళ్లిళ్లు 10 కాగా విడాకులు 12 లెక్కతేలాయి.

Printed and Published for NageswaraRao Estates (Private) Ltd,. by S. Radha Krishna at The Andhra Patrika Press 6 & 7. Thambu Chetty Street Madras-1 Editor S. Sambhu Prasad

**Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.**